'కృష్ణకథావిపంచి' అను పేర శ్రీకృష్ణరాయల చరిత్రను సప్తరాగ పరిమితమగు పద్యప్రబంధముగ బాడాల రామయ్య సంతరించి యున్నారు.

ఈ కృతియందు క్రొత్తపాతల మేలికలయిక కొమరు మీరినది. ధారాశుద్ధి, కథానిర్వహణరీతి, పాత్రపోషణ, రసౌచితి కలిగి ఆంధ్రతాముద్రచే నీ కావ్యము నవ్యకావ్యముల విన్నాణ మగుగతిని విరాజిల్ల గలదు.

కృతియందు దోషములు కొన్ని యున్నను బుధులు క్షీరనీర న్యాయమున గుణములను మాత్రమే గ్రహింతురు గాక.

'శుష్క చారిత్రకము రసశూన్య మైన
జననమరణంపు చర్చల సాగనీక
దండయాత్రల వైనంబు దండ లిడక
వారి వీరి యభిప్రాయ భార మిడక
సారతర మైనఘట్టముల్ సంతరించి
తనరఁ జేసితి కృష్ణకథావిపంచి'

రసవత్తరములును, రామణీయకములును నగు నిట్టి రచనల నెన్నియేని రామయకవి ఆంధ్రలోకమునకు ప్రసాదించు గావుత-ఇతి శివమ్.

విద్యారత్న నిడుదవోలు వేంకటరావు.
ఆంధ్రశాఖాధ్యక్షుడు,
మదరాసు విశ్వవిద్యాలయము.

*   *   *

Ramakavi is indeed a new star of the first magnitude in the literary firmament of Modern Telugu poetry. He has covered himself with credit by handling a great subject in grand style. The poem is a sustained work of art. The very grandeur of the conception of the poem, in a musical mould, each canto bearing the appellation of a raga, challenges attention, and in its onward march, when all the various parts blend into a harmonious melody of rare poetic beauty then the reader is transported into the realms of poetic fancy of the highest type. The matter, the metre, the manner, and the mellifluous flow of words all enchain the mind, and enchant the heart, and keep us spell bound till the end. Some of the passages, have a haunting quality which linger in our minds, long after we have read the poem, such as a few master poets alone could create.

The loftiness of the philosophical thought embedded in some passages, the rare, and unconventional flights of imagination displayed in some of the descriptive portions, the astonishing range, purity, and depth of emotion exhibited in the marvellous scenes, of love and Bhakti the creative genius of the grand finale of Bhuvanavijaya, all these are some of the highlights of this remarkable poem.

In itself, it is a great work of art. It is greater still in the promise it holds out for the future.

R. KRISHNA SASTRY
*Madanapalli.*

---

# విన్నపము

ప్రకృతిశక్తులపై మానవుడు సలిపెడి పోరాటములో ఒక భాగము చరిత్ర. ప్రకృతి రహస్యాన్ని బయల్వెఱచి విశ్వ శ్రేయస్సును కూర్చునది వేదాంతము. వేదాంతమునకు సౌందర్య రచన కవిత్వము. కవిత్వము, వేదాంతము, చరిత్ర ఈ మూడింటికి గల పరస్పర సంబంధమే మహాత్ముల జీవితములకు వ్యాఖ్యానము.

ప్రకృతియొక్క యుగయుగాల తపస్సు విశాలవిశ్వము నం దనంతకాలమున ఎక్కడో మహాత్ముల రూపమున సిద్ధింప గలదు. వారి బాహ్యస్వరూపములు నీలాకాశమున మెఱపు తీవలు. వారి కాలప్రమాణము అనంతకాలమున అమృతఘటి కలు. కాని ఆ మెఱపులలోని వెలుగు, ఆఘటికలలోని అమృ తత్వము దేశకాల ఉపాధి భేదములకు అతీత మై మానవుని శాశ్వతానందమునకు పూలబాట కాగలదు.

మానవజన్మచే ఒకటి రెండు దోషము లున్నను మహాత్ముల కోవలోనివాఁడగు శ్రీకృష్ణదేవరాయలు సార్వభౌమ. మహాకవి, కళారాధకుఁడు. ఈతని గుణములే నన్ని కావ్యరచనకు పురి కొల్పినవి,

ఈశ్వరుని విలాసము నియమము. నియమబద్ధము నాదము. నాదాత్మకము ప్రపంచము. ప్రపంచస్థ మగుఅనంతా నంత రసస్రోతస్సుల భారతీయులు సప్తసర్వములక్రింద విడ గొట్టిరి. మనకు నాదోపాసనచే ప్రపంచస్వరూపమును పరిపూర్ణ

ముగా తెలిసికొనుటకు వీణయే ఉపాదేయ మని విజ్ఞానస్వరూపిణి యగుభారతీదేవి వీణను చే ధరించె నేమో !

సంగీత సాహిత్యములకు అవినాభావసంబంధము కలదు. సంగీత మాపాతమధురము. సాహిత్య మాలోచనామృతము. కనుకనే వాణి వీణాపుస్తకపాణి. వీణలో ఒలికే రాగములు రస స్ఫోరకములు. రసములు నాయకుని అవస్థానుగుణములు. నాయకుడగు శ్రీకృష్ణరాయల అవస్థాస్థితి ననుసరించి రాగముల బేర్కొంటిని. ఈ రాగముల బేర్కొనుటలో నా అనుభూతియే కాని ప్రబల మగుశాస్త్రాధారము ఉన్న దేమో వెదకవలసి యున్నది. సంగీతము లేనిసాహిత్యము, సాహిత్యము లేనిసంగీతము స్త్రీ లేని పురుషుడు, పురుషుడు లేని స్త్రీ. ఈ రెండింటి సంయోగము బ్రహ్మానంద సదృశము. వ్యక్త మగు శబ్దార్థమును అవ్యక్త మగునాదమాధుర్యముచే హాయిగా పాడుకొన ప్రయత్నించితిని. తత్ఫలితమే కృష్ణకథావిపంచి.

ఈ కావ్యమునకు రాయలనాటి చరిత్ర, శాసనములు, వాఙ్మయము మూగర్రాలవలె నాకు తోడ్పడినవి. ఈ గ్రంథమును వ్రాయునప్పుడు నా పద్యముల విని నన్ను ప్రోత్సహించిన శ్రీ ఊటుకూరి ఆంజనేయ శర్మగారిని, గ్రంథమును ముద్రించు నపుడు సర్వాంగసుందరముగ తీర్చుటకు నా కెంతయు తోడ్పడిన నా మిత్రుఁడు, సాహిత్య సౌందర్యోపజీవి అగు శ్రీ తిమ్మావజ్ఝల కోదండరామయ్యగారిని ఇచ్చట ప్రశంసింపక యుండ జాలను. నా కవితాకళకు మెచ్చుకొని, దరిజేర్చి విద్యాదాన మొనర్చిన స్వర్గీయు లగు వావిళ్ల వేంకటేశ్వర శాస్త్రిగారు నాకు చిరస్మరణీయులు. గ్రంథమును ముద్రించి యిచ్చిన ముద్రణాధి

కారులు ప్రశంసార్హులు. అడిగినవెంటనే నా పుస్తకముపై అభిప్రాయముల బంపిన పండితులకు, కవులకు అందఱికిని నా నమస్కారములు. ఈ పుస్తకమునకు ఆంగ్లమున పరిచయ వాక్యములు వ్రాసిన మైసూరు మహారాజా కళాశాలయందలి చారిత్రక శాఖాధ్యక్షులును, ఖండాంతర ప్రఖ్యాతి గల్గినవారును నగు శ్రీయస్. శ్రీకంఠశాస్త్రిగారికినా హృదయపూర్వకనమోవాకములు. ఆంధ్రభాషలో విపుల మగుపీఠికను వ్రాసిన బహుభాషా కోవిదుడు, సరస్వతీపుత్రుడు, మా అన్నయ్యయు నగు శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులవారికి నే నెంతయు కృతజ్ఞుడను.

—బాడాల రామకవి..

# కృతజ్ఞత

నా యీ కావ్యము వెలుగులోనికి వచ్చుటకు తోడ్పడిన శ్రీపాపన్న గుప్తాగారికి, రాటకొండ నరసింహారెడ్డిగారికి, శ్రీ తంబళ్లపల్లి నాగిరెడ్డిగారికి నా హృదయపూర్వక వందనములు. ఇక నా గ్రంథమును సాంతముగ నాలకించి రసపరవశులై సన్మానముల సలిపి ఈ పుస్తకము అచ్చొత్తించుటకు ద్రవ్యసహాయము చేసిన నూ మదనపల్లి వాస్తవ్యులగు ఈ క్రింది కళాభిమానులకు నే నెంతయు కృతజ్ఞుడను.

| | | |
|---|---|---|
| శ్రీ తంబళ్లపల్లి నాగిరెడ్డిగారు | రూ. | 116 |
| ,, తంబళ్లపల్లి రఘునాథరెడ్డిగారు | ,, | 116 |
| ,, తంబళ్లపల్లి కృష్ణారెడ్డిగారు | ,, | 100 |
| ,, అంకిసెట్టిపల్లి నంజుండప్ప | ,, | 116 |
| ,, కార్పొరేషన్ బాంకీవారు | ,, | 116 |
| ,, దివ్యజ్ఞానోన్నత పాఠశాలవారు | ,, | 116 |
| ,, రాటకొండ రంగారెడ్డిగారు | ,, | 58 |
| ,, సుబ్రహ్మణ్య అయ్యర్ | ,, | 50 |
| ,, కృష్ణశాస్త్రి, (వకీలు) | ,, | 50 |
| ,, డాక్టర్ కృష్ణమూర్తి | ,, | 25 |
| ,, అచ్చయ్యశెట్టి (కోలారు) | ,, | 25 |
| ,, చవల సీతమ్మగారు (పాకాల) | ,, | 25 |
| ,, పాపన్నగుప్తా, నరసింహారెడ్డి ద్వారా ఇతర సాహిత్యాభిమానులు. | ,, | 100 |

,, మాకం సుబ్రహ్మణ్య శెట్టి ద్వారా నా స్నేహితు లిచ్చినది. } ,, 90

మైసూరు పట్టణమున గొప్ప సన్మానసభ నేర్పాటు చేసిన శ్రీ పుట్టు గోపాల శెట్టిగారి రసజ్ఞతయు, అదే సందర్భమున నూటపదార్లు ఖద్దరు శాలువలతో నన్ను గౌరవించిన బోయి వెంకటదాసుగారి ఔదార్యమును కొనియాడ దగినవి. చెన్నపట్టణమున త్యాగరాయకళాశాలవారును, వావిళ్ల వారును చేసిన సన్మానములకు నే నెంతయు కృతజ్ఞుడను.

ఇట్లు, విధేయుడు
రామకవి.

---

# అంకితము

కని పెంచి పెద్ద చేసిన
జనకుని ఋణ మీగ నొక్క జన్మము తగునే?
జనకా! నీలో నినదిం
చిన శక్తులె కావ్య మయ్యెఁ జేకొను మయ్యా.

మా రాముం డేదో యు
ద్ధారం బొనరించు నంచుఁ దండ్రీ! యెన్నో
సారులు వల్కితి రపుడే
ఘోరం బాకాలము మిము గుటుకున మ్రింగెన్.

నూఱేండ్ల య్యెనె? మీ యువ
తారము చాలింపఁగఁ బితృదైవతమా! మా
యూర న్నవఁ డాగుళ్ళకుఁ
జేరం జని మ్రొక్కు లిచ్చి సేవించు నొకో!

నీవే పుణ్యుండ వరయన్
దైవం బనుమాట లేనిధర హృదయంబుల్
చావఁగ యంత్రాకృతి నిట
మావలె నడయాడ కీవు మఱగితి వెటకో?

నీ వొక మహాతపస్వివి
నీ వాక్కుల ఫలమె నేఁడు నిరుపమ కావ్యం
బై విలసిల్లిన దీ యాం
ధ్రావలి గలదాఁక మీర లలరెద రిటపై.

శ్రీశివావృతంబై నవజీవకళల
సృష్టిసౌందర్యభవనమై జీవనదుల
నమృత మొలికించి దివ్యమా నార్ష మహిమ
లలరు మా యాంధ్ర దేశంబు నాత్మఁ దలతు.

ఎల్లరసములు కరుణ నుత్ఫుల్ల మగుచు
బాధలఁ బ్రపంచశాంతియ పరిమళింప
రాయలవిపంచి వేదనాస్థాయిఁ దవిలి
యమృత మొలుక నసావేరి నాలపించు.

# అసావేరి

విమలవిద్యారణ్యవిజ్ఞానతేజస్సు
భరతజాతికి నాత్మబలము వోసె
హరిహరబుక్కరాయలశౌర్యలక్ష్మి సు
స్థిరరాజ్యలక్ష్మి కాశీస్సులొసఁగె
దాక్షిణాత్యులక్షాత్రదావాగ్నికీలల
నశియించె హైమచంద్రధ్వజాలు
సర్వాంగసౌందర్యసముపేత యై యాంధ్రి
కోయిలపాటలగుట్టు దెలిసె
మూఁడుపూ లారుకాయ లై మురియుచుండ
విశ్వమానవ కల్యాణ విజయగీతి
వాడవాడల మ్రోగింపఁబడియెఁ గృష్ణ
రాయ లాంధ్రకర్ణాటసామ్రాజ్య మేల. 1

బాహుబలంబునం దోదవుపాటవ మంతయుఁ దూచి, శత్రులన్
సాహసమూర్తి యై గెలిచి శాంతికి భంగము లేనివిశ్వస
మ్మోహన మైనతేజము సముజ్జ్వలశక్తి ప్రజానురక్తి యా
యైహికభోగముల్ కలిగి హద్దుల మీఱఁడు కృష్ణరాయఁడున్. 2

రాయచూరును ముదగల్లు రాజ్యరమకుఁ
బ్రాణ మని పూర్వరాజులు వ్రాసి పదిల
పఱచుపత్రముల్ స్వాయముగాఁ బ్రభుఁ డెఱింగి
తనకుఁ గలసర్వశక్తులఁ దఱచి చూచు. 3

వివిధశాఖాధిపతులఁ బిల్పించి నృపుఁడు
విజయనగరపు సైన్యముల్ విశదపఱిచి
దాని కగువెచ్చముఁ మన ద్రవ్యశక్తి
పల్కుఁ డని తెల్ప నల్లాలప్రభువరుండు.

రాజులభూషణరాజికై నాల్గుకో
ట్లపుడె రత్నంబుల కాఱుకోట్లు
దాదాపు శతకోటిద్రవ్యంపుభండార
మిచ్చె విద్యారణ్యఋషివరుండు
ఇరువదికోట్లింతవఱకును బాలించు
నృపకోటి మిగిలించి నిధులఁ బెంచెఁ
బదునొండుకోట్ల ద్రవ్యంబు కర్ణాటరా
జ్యంబు దై యుండె నోస్వామి! మునుపు
నిధులకుఁ గుబేరులై పూర్వనృపులు మెలఁగి
రమరనాయకులబలంబు లండ గాఁగఁ
గాని తగినంత బలము లోక్కవిభుఁ డైన
స్వాయము పోషించుకొనునట్టి జాడ లేదు. 5

ఎవ్వనిఁ బల్కరించిన నదేమొ ప్రభూ! యిట లెక్క చూచినన్
గవ్వయు సైన్యరక్షణకుఁ గర్చుగ లే దని విన్నవింపఁగాఁ
గవ్వముతోడ మానసము కల్కినరీతిఁ జలింప రాజు దా
దవ్వుల రంగనాథుగుడిదాపున కేఁగె నొకండ యంతటన్. 6

అంతిపురము వీడి యండ లేక నృపుం డా
కండె కాలినడక కదలె ననెడి
వార్త చారుఁ డొకఁడు పరుగునన్ వచ్చి తి
మ్మరసుచెవుల నూఁది మాయ మయ్యె. 7

దైవమే శరణ్యం బని తరలె నేమొ!
తన యయోమయస్థితి యిటుల్ దాఁచె నేమొ!
మముఁ బరీక్షింప నీగతి మసలె నేమొ!
తెలియు లేము మా విభునిచర్యల విధంబు. 8

అపరూపం బగుకృష్ణరాయ లిటు లాయాపట్ల వర్తించుటల్
విపరీతం బిది రాచమార్గమునకున్ విద్రోహ మేమేమి హా
నృపుఁగర్మంబులఁ బూనిరో! ప్రభువి కేయన్యాయముల్ మూఁడునో!
నృపసంరక్షణ మాత్మధర్మ మనుచున్ వేవేగ నామంత్రియున్. 9

కృష్ణరాయ లిదే వేఁట కేఁగుచుండె
సకలసైన్యసమేతు లై సాఁగుఁ డంచు
నమరనాయకుల కనుజ్ఞ లంపి ముందు
తిమ్మరసు వచ్చి కృష్ణక్షితీశు నరసె. 10

భక్తిభయంబు లొల్కఁగ నృపాలునిఁ జేరి వచించె మంత్రి ధీ
శక్తిని వేఁటకై విభుఁడు సాఁగె బలంబులతోడ నాయక
వ్యక్తుల శీఘ్రమే కదలుఁ డంచు భటావళిఁ బంపి యుష్మదా
జ్ఞోక్తిగఁ జాటినాఁడ సమయోచితకార్యనిబద్ధబుద్ధి నై. 11

తమయాజ్ఞం దల దాల్పమో ప్రజల సంతాపంబు వోకార్పమో
తమరాజ్యాంగపు ధర్మముల్ నడుపమో తంత్రజ్ఞులై రాచసా
ధములం దున్ననృపాలు రిట్లు తిరుగన్ ధర్మంబె? విస్వోధియం
దమృతాంశుం డలరారుఁ గాక మహిపై నావిర్భవం బందునే? 12

అప్పాజీవాక్యంబుల
నొప్పెడిభవితార్థ మరసి యుర్వీశుండున్
దప్పానరించినగతి నో
ర్విప్పక నగరమున కేఁగె విచలితుఁ డగుచున్. 13

అది యేకాంతగృహంబు నిర్మలసమీరాంకూరముల్ ప్రాకుచున్
హృదయోద్యానము భావపుష్పములు పుష్పీభూత నానాకాల మ
య్యదనన్ రాయలు రాచకార్యములయం దాలోచనాబద్ధుఁ డై
మది యేమో తలపోయుచుండఁ జకితం బౌ నొక్కఁడే తెంచుటన్.

ఆజ్ఞ లేక రహస్యగృహాంతరమున
కేఁగుదెంచినవాని నీక్షింపఁ డాయె
బోనులోఁ బడి తిరిగెడిపులివిధాన
నిటు నటుఁ బచారు చేసెడినృపునిఁ జూచె. 15

దగ్గర కేఁగుదెంచి తన దక్షిణహస్తముతోడఁ దట్టి తా
నగ్గలమైనప్రేమ మది నంటఁగఁ జూచి నృపాల! చింతలన్
మ్రగ్గెద వేటికో మనసుమర్మము దెల్పుము రాజ్యలక్ష్మికై
యెగ్గొనరించువార లొకరేనియు లేరు గదా! భవత్స్థలిన్. 16

నిదురం జెందినబెబ్బులిం గదిసి యేసీచుండు రాల్ జువ్వఁగా
మది నుంకించెనొ! శాంతిదాంతినిలయం బౌతల్లి కంఠంబు నే
చెదరం జేయఁగఁ గత్తి నెత్తినదయాశ్రీమంతుఁ డెవ్వం డొకో!
హృదయోద్వేగము మాని సత్యమును సంతేపించి రూపింపుమా!

అనుచుం డాసినమంత్రిశేఖరునితో నప్పాజి! మీ బుద్ధినై
పుణి మీఖడ్గపటుత్వముం గలియ ముప్పాల్ పొందునే రాజ్య మె
వ్వనికిం గుండెలు తల్లితోఁ గలపులిక్ ప్రాణంబులక్ దీయఁ దం
డ్రీ! నమస్కారము మీ యనుగ్రహకళా ప్రేమప్రభారాశికిన్.

పసిపాప నై యింటఁ బారాడునప్పుడు
ప్రీతితో నొడిఁ జేర్చి పెంచినావు
అగ్రజుకుట్రలో నణఁగారి పో నున్న
ప్రాణంబు లపుడు కాపాడినావు
నియమంబుతో రాజనీతిశాస్త్రంబున
నీ సరివానిఁగాఁ జేసినావు
ఆంధ్రకర్ణాటమహారాజ్యలక్ష్మి నక్
వరియింపఁ బలుపాట్లఁ బడితి వీవు

ఇంతవానిగ నొనరించి యెల్లవేళ
వేయికన్నులఁ గాపాడుప్రేమమూర్తి
వమలనిష్కామయోగి వై హైందవాభ్యు
దయపథంబున నడిపించు ధర్మమూర్తి!

కలదు మనంబు నెల్లఁ గలకాలమునుండి కలంచి బాధలన్
గలవరపెట్టుకోరి కదికంటికి నిద్దుర సీదు చేతితోఁ
గలఁచినరీతి నాయెద వికల్పిత మయ్యెఁ దలంప మేనికం
డల హరియించుమృత్యు వయినన్ దహియించు నటంచు నెంచెదన్.

అప్పాజీ! యెదలోని బాధ భవితవ్యార్థంబు భావించినన్
నిప్పుల్ రాచిన రాచపుండు నగు నా నిర్వేదముల్ పాపి నన్
దప్పింపం గలనేర్పు దక్షతయు విద్యాకౌశలం బెల్ల మీ
కొప్పున్ దక్షిణభారతావని ప్రమోదోత్సాహతన్ దేలెడిన్.

ఎడతెఱపి లేక యెగసి పైఁ బడుమహమ్మ
దీయసేనాప్రవాహ మెదిర్చి నిలుప
నొక్క మగవాఁడు పుట్టు నేమో! యటంచు
ధర్మదేవత యాశలఁ దల్లడిల్లు. 22

మతము మత మన్నపిచ్చిలో మనుజతతిని
గొంతు కోసెడియజ్ఞంబు కోరలేదు
స్వార్థపరుఁ డౌచు రాజ్యవిస్తారకాంక్ష
ననుమతింపఁగ లేదు నాయంతరాత్మ. 23

ధర్మపీఠంబుపై నుండి తత్త్వ మరసి
దేశకాలపరిస్థితి తీరు లెఱిఁగి
ప్రజల తలఁ జొచ్చి రాచమార్గములఁ దీర్చు
నెవ్వఁ డైన సరే రాజ్య మేల నిమ్ము. 24

ధర్మతత్త్వంబునన్ ధ్రువతార గాఁగ
యుగయుగంబులనుండి మహోజ్జ్వలాంగి
యై వెలుఁగు మా భరతలక్ష్మి యనవ యగుచుఁ
గంటఁ దడిపెట్టుకాలంబు కలిగె నేఁడు. 25

ఋషుల యాగంబులం బవిత్రీకృతంబు
లై ప్రశాంతగీతంబుల నాలపించు
భారతిధరిత్రి రక్తంపుటేరులఁ బడి
తనుకలాడు చిపుడో! హా! మునుఁగ నుండె. 26

తెగిన ముత్యాలసరముఁరీతి నొకదారి
లేక దిక్కు దిక్కున కొక్కపోక డగుచు
బల ముడిగి పరాక్రాంత మై బాధ పడెడి
దక్షిణావని దరిఁ జేర్పఁ దలఁచుచుంటి. 27

మా యోపాయము మర్మభేదనము ధర్మాధర్మసిద్ధాంతమున్
న్యాయాన్యాయవివేచనం బదనులో నత్యద్భుతప్రాభవం
బే యుద్ధావని కైనఁ దగ్గనిబలం బేరీతిఁ జేకూరునో
నా యాశాలతి పువ్వులన్ విరియునో నాశంబె యై వాడునో. 28

ఎన్నో యూహలు పుట్టుచున్న వెదలో నేదో వ్యధాక్రాంత మై
ఛిన్నాభిన్నము లౌచుఁ దూలి పడునో సేమంబు సేకూర్చునో!
నన్ను న్మెత్తురో! రాజనీతివిదు లీ న్యాయంబు పాటింతురో!
యెన్నంజాలక బాధలన్ నలఁగుచుం దీ యార్తిశోకార్ణవే. 29

సామంతనృపుల విశ్వాసంబు బలము సా
గరసమీపస్థ మాకట్టడంబు
సరిహద్దులం దున్న సైన్యాధిపతు లన్న
కత్తికిఁ గై మోడ్చు కపటమతులు
ఉదయాచలాది మహోజ్జ్వలదుర్గముల్
గజపతిచేతిలోఁ గడచు నేమొ!
రయచూరు ముదగల్లు ప్రజ లన్న మొన్న నే
సుల్తానుపాలనఁ జూచెఁ గొంత

తరతరంబుల తాతముత్తాత లెల్ల
దక్షిణధరిత్రి తా మొకత్రాట నడపఁ
గలలు గొని రా తలంపులు కలలు గానె
నిలుచునో! లేక యిపు డైన ఫలము గనునో! 30

శిలల జీర్ణ మై మఱగినజీవశక్తి
మఱలఁ జివురించుకాలంబు మరలి రాదో!
సృష్టిలోఁ దాఁగి యుండెడియీశ్వరాంశ
కనులఁ గట్టెడిభాగ్యంబు కాంచ లేమొ! 31

ప్రకృతి పులకింప దేహముల్ పరవశింప
మానుషత్వ మమర్త్యత్వ మై చెలంగ
శారదరసవిపంచికాస్వరము లెపుడు
చెవుల మధురామృతంబులఁ జిందఁ గలవో! 32

అనుచుఁ బెచ్చునినీటిబిందువులు నేత్రాబ్జంబులన్ నిండ నా
త్మను రేకెత్తుతుపానుతుంపురులలోఁ దబ్బిబ్బు లౌకృష్ణరా
యని వీక్షించి ప్రమోదభావభరితుం డై మంత్రి రాజా! భవ
ద్గుణముల్ భారతభాగ్యలక్ష్మికి ఫలోద్భూతంబు లై వ్రాలెడిన్.

ఎన్నిదినంబు లయ్యె నిటు లీగతి రాజులు రాచధర్మముల్
మన్నన సేయుటల్ ప్రజలమార్గము సొచ్చుట దేశలక్ష్మికై
ఖిన్నత నెందు చీహృదయకీలల స్రుక్కుఁగ నేల? నేఁడె నా
పిన్నతనంబునం బొడముపేడుక లెల్ల ఫలించె భూవరా! 34

భీకరు లై ప్రజాభ్యుదయపీడితు లై స్వమతాభిమాను లై
కాకులరీతి వ్రాలినవికాసవిహీనులఁ గ్రౌర్యపుం స్వభా
వాకృతిఁ గాంచ గుండె లవియన్ దగుదారియు లేక యొఁచితిన్
చీఁకటి మానదా! వెలుఁగు చిందెడిరోజులు రాక యుండునా? 35

ఎన్నిదినంబులో యెదురు నీఁదితి దైవబలంబు లేక నా
పన్నినయత్నముల్ పడినబాములు లెక్కకు రాక కానలో
వెన్నెల లయ్యె మంచి కనిపించెడిరోజులు కల్ల లయ్యె న
భ్యున్నతి గంగలోఁ గలిసె మోసము తాండవ మాడె భూమిపై.

ఆ దినముల్ తలంచిన నృపాగ్రణి! కంటికి నిద్ర వచ్చునే
యీ దిన మైన సౌఖ్య మొకయింతయు లేదు మదీయభావనా
స్వాదితమూర్తియున్ రణవిశారదుఁ డీగతి నొక్కఁ డున్న భా
గ్యోదయ మందదే ప్రజ? మహోజ్జ్వలశక్తులు కూడకుండునే? 37

భూవర! నేఁటికిన్ మునిఁగిపోయిన దేమియు లేదు స్వల్పకా
లావధి కల్గినన్ మన బలంబులు సేకుఱుఁ గాదె? దానిపై
దైవము కన్ను విప్పిన స్వధర్మము మీకరమందుఁ బండు నా
జీవిత మీ ప్రజాభ్యుదయసేవలఁ జిందులు ద్రొక్కునో ప్రభూ! 38

అదిగో! భారతలక్ష్మి మీ సహృదయోద్యానాంతరక్షోణిలోఁ
బదమంజీరఝుణంఝుణాకృతులతోఁ బారాడెనో యంచు మీ
మృదువాక్యంబులలో ధ్వనించెను ప్రభూ! మే లయ్యె మాజాతి కీ
పదముల్ రాగిము లల్ల మా యెదల సౌభాగ్యంబు దీపించుఁగా.

నాగరత్రయి యలల మీ చరణ మంట
నాతపత్రమ్ము గాఁగ వింధ్యంబు మీకుఁ
దమసహృదయంబునన్ ధర్మతత్త్వ మొలుకఁ
గాల మరుదెంచె స్వామి నిన్ గాంచఁ గానె. 40

హృదయ మున్న నృపతి కీరీతి ధర్మంబు
ధర్మ మలరుచోటఁ దగినశక్తి
శక్తితోడ దైవభక్తియుఁ గూడె నా
పడిన శ్రమము లెల్ల ఫలము లయ్యె. 41

సైన్యములన్ హెచ్చింపుచు
నన్యుల హృదయంబు లరసి యదనున నతినై
పుణ్యమునన్ మెఱుపులవలె
సైన్యము నడిపింపవలయు శత్రులపైకిన్. 42

కాలానుగుణంబుగఁ గడుఁ
దాలిమితో నెలఁగ వలయుఁ దగుకీర్తిని సై
న్యాలను జేకూర్తుఁ దమ బ
లా లప్పుడె చూపఁ దగు ఫలం బేర్పడఁగాన్. 43.

మీ రంతదనుక నే వ్యా
పారంబున కేని ముందు వడక ప్రశాంతో
దారమనంబునఁ బ్రజపై
గౌరవ మిడి నగరు విడిచి కదలకుఁ డనియెన్. 44

విద్యానగరౌన్నత్యము
విద్యారణ్యుని తపంబు వివిధోజ్జ్వల మై
విద్యాభోజా! మీసుగు
ణోద్యోగమునం దె యిఁక ఫలోదయ మగుఁ గాన్. 45

అనఁ గృష్ణనృపతి హృదయం
బునఁ గ్రమ్మినమబ్బు లెల్లఁ బోడవు సెడెఁ మో
మున హాస రేఖ చివురిం
చెను దిమ్మరుసయ్య కార్యచింతల మునిఁగెన్. 46

ఇది ప్రథమాశ్వాసము.

చేవ చెడి కృశించెడిరసక్షేత్రతతుల
నవక మెసఁగ నాదోపాసనాబలుండు
దీక్షితస్వామి పాడినదివ్యరాగ
మమృతవర్షిణి నీవీణ యాలపించు.

# అమృతవర్షిణి

పాషాణంబులఁ దీర్చి దిద్దుచుఁ గళాబ్రహ్మాండఖండంబులన్
బోషింపం గలశిల్పివర్యులు జగత్పూజ్యప్రభావాత్ము లా
భాషానాథుని సృష్టికిన్ మెఱుఁగు సూపన్ శ్రావ్యసంగీతముల్
-షింపన్ భవనంబుఁ గూర్చిరి నృపాగ్రుం డందుఁ గొల్వుండఁగన్.

ఉన్నతసింహాపీఠ మధికోజ్జ్వలరత్నరుచిప్రభావ మ
త్యున్నత మై వెలుంగఁగ శుభోదయ మంద సభాస్థలంబు త
త్సన్నిధి హేమపీఠ మది సర్వకళామయి యైనవాణిచే
మన్నన లందుకొన్నకవిమాన్యుని గౌరవపీఠ మయ్యెడిన్. 2

పాలరాతి గచ్చుపైఁ బ్రసరింప వ
జ్రాలకాంతి యా విశాలవిశ్వ
మోహనాంగణమున మ్రోగింపఁ బడియె ఘ
ణఘణఘంటికానినాదసరణి. 3

ఆనినాదవీచికాహ్వాన మంది సా
మంతనృపులు సకలమంత్రివరులు
దండనాథు లుచితధర్మజ్ఞులు రసజ్ఞు
లైనకవులు నిండి రా కొలువున. 4

ఆయపూర్వసింహాసనం బరయుచు నిది
తిమ్మరసు గౌరవార్థ మై తీర్చి రేమొ!
సాహితీసార్వభౌముని స్థాన మౌనొ!
యనుచు సభ్యులు లోలోన గొణగుచుండ. 5

జయ మహాంధ్రకర్ణాటరాజ్యాధినాథ!
జయ యవక్రపరాక్రమసార్వభౌమ!
జయ సమస్తకళాకలాసాంద్ర! యనుచు
వందిమాగధస్తోత్ర మవ్వారి గాఁగ. 6

మిసమిసలాడుజవ్వనము మీసములన్ దళుకొత్తునవ్వు మా
నసమధురార్ద్రభావముల నైపుణిఁ జూపుదృగంచలంబులున్
బస లొలికించుఠీవుల శుభప్రతిపాదితుఁ డైనకృష్ణరాట్
రసికవరుండు నల్లన భటాంగణముతోఁ జనుదెంచె నంతటన్.

బారులు దీరుసద్భటులఁ బౌరుషమూర్తుల దండనాథులన్
బేరుప్రతిష్ఠలం గలుగుపెద్దల మంత్రులఁ బండితావళిన్
సారవచఃప్రమాణులఁ బ్రశస్తవిలాసకళావిలాసులన్
బాఱఁగఁ జూచి యానృపుఁ డపారదయాంబుధి యెక్కె గద్దియన్.

తళతళత్కాంతు లా శారదాకళాక
లాప్రభాభావపుంజంబు లై వెలుంగఁ
బసిఁడిగండపెండేరమున్ భటుఁ డొకండు
పైఁడిపీఠంబుపై నిడె ప్రభునియాజ్ఞ. 9

కిటకిటలాడు నా సభ మృగీమదచందనచారుసౌరభో
త్కట మయి గాలులన్ విసరఁ గమ్మనిగీతిక కంఠ మెత్తియ
ప్పటి కనుకూలరాగములఁ బాడె నొకానొకగాయకుండు న
చ్చటిజన మేదియో తెలియఁ జాలనిహాయిని దేలియాడఁగన్. 10

అప్పటి యాసభ్రాంతరరసార్ద్రమనఃపరిపాకసిద్ధులం
దెప్పర మంద రాజు కడుఁ దిన్నఁగఁ జూచి రసజ్ఞులార! మే
మిప్పటి రాచకార్యముల నిమ్మహిఁ బ్రోవ విలాసవిద్యలన్
మెప్పులు పొందువారె జగ మెప్పుడుఁ బ్రోచెడిదివ్యులారయన్. 11

భువనమోహనసౌందర్యపుంజ మొకఁడు
రాతిలోఁ జూచి యానందరసము పిండు
సృష్టిసౌందర్యరేఖలఁ జిత్రములుగ
సృష్టి నొనరించుకొను రసజీవి యొకఁడు. 12

అలలవలె రేఁగుచు ననంత మై చెలంగు
భావవైవిధ్య మెల్ల శబ్దమునఁ జూపి
తెలియఁజాలనిరసవీథిఁ దేలిపోవు
మధురసోన్మత్తుఁ డొకఁడు డీ మార్గమందు. 13

చూడఁడే కాని మన కెల్లఁ జూపుచుండుఁ
బలుకఁడే కాని మనచేతఁ బలుకఁ జేయుఁ
జిత్ర మైనయోగసమాధి శిల్పసృష్టి
బ్రహ్మసృష్టినే తల దన్నఁ బ్రాజ్ఞుఁ డొకఁడు. 14

అంద ఱానందమూర్తులే యందఱికిని
భగవదంశ జన్మంబుతోఁ బట్టువడును
కాని కాలమును జయించుకవి యొకండె
యమృతమూర్తి సదానందుఁ డందఱికిని. 15

కత్తిబలంబుచే మన మఖండమహీవలయంబు గెల్చి సం
పత్తులఁ దూఁగవచ్చుభటవర్గముతోఁ బ్రజ నేల వచ్చు, నా
మిత్తి నెదుర్కొనం గలుగుమేటి యొకండును లేఁడు కాని య
త్యుత్తమమై ప్రజాహృదయ మూఁపదె శాశ్వత మాకవిత్వమున్

కాలుని ఖడ్గదేవతకుఁ గానుకలు గాఁగ శిరంబు లెన్నియో
వ్రాలిన, వెంద ఱెందరో పరాక్రమవంతులు తూలినారు, స
త్త్వాలయ మహాప్రజాభ్యుదయతత్త్వము పాడుచు మిత్తికంటిలో
ధూళిని జల్లరే కవులు? దోఁపరె నేఁడు యశశ్శరీరులై? 17

సౌందర్యాంబుజలక్ష్మి యా ప్రకృతిలో శాస్త్రామృతాస్వాదియై
పొందీపొందని రాగభోగములలోఁ బొర్లాడునాభోగి కీ
యందీయందని దైవతత్త్వము నభివ్యక్తంబు గావింపుచున్
సౌందర్యార్చనలోఁ దపఃఫలములన్ సాధింపరే సత్కవుల్? 18

వెన్నెలపూఁతలున్ విరులవేడుకలున్ సెలయేటిపాటలున్
సన్ననిగీతలున్ సరససస్మితమైనవిలాసమాధురుల్
తిన్ననిపిల్లతెమ్మెరలు తీరని ప్రేమవివాదబాధలున్
గ్రొన్నెలవంక సౌఖ్యములు కూర్చును గాదె కవీంద్రుఁ డెప్పుడున్.

ప్రకృతిలో లీనమై కవి పాడుకొనును
ధ్యానయోగంబులో యోగి తన్మయుఁ డగు
నిద్ద ఱానందమూర్తులే యిద్దఱికిని
గమ్య మొకటియే కాని మార్గములు వేఱు. 20

జగమే మిథ్య యటంచు యోగి ప్రకృతిన్ సౌందర్యమే చూడఁడే
జగమే నిత్య మటంచు భోగి భగవత్సౌందర్యమే చూడఁడే
పగ మాన్పింపఁగ యోగభోగముల తత్త్వానందముల్ గూర్చు చా
భగవత్తత్త్వము సత్కవుల్ ప్రకృతిలోఁ బ్రత్యక్షముం జేయరే!

వారి నెదిర్చి నిల్పఁగల ప్రాభవ మేదియు లేదు భూమిపై
వారు జగన్నియంతలు శుభప్రతిపాదకధర్మమూర్తు లా
చారపరంపరాస్థితికి సద్గురువుల్ హృదయప్రమోదమం
దారులు సృష్టి నెల్ల నమృతమ్ముగఁ జేసెడిబ్రహ్మతేజులున్. 22

యుగయుగాంతరములనుండి యూరకొనక
యెందరెందఱు త్రవ్విరో యీ గనులను!
మణులు దొరకినపుణ్యులు మఱపు రారు
శిలలు దొరకినవారికిం జింత లేదు. 23

పశులను జంపు నొకబోయవాని కేని
ముద్దు లొలికించు నెలరాల మూట దొరక
మణులఁ గూర్చి రామాయణమధుర కావ్య
హార మర్పించె భాషాశుభాంగి కతఁడు. 24

కాళిదాసుఁ డీ భూమిలోఁ గాలు వెట్ట
భరతనాట్య మావేశసంభరిత యగుచుఁ
జేసె నొక నూత్నకవితావిలాసవతియు
నామెయాటల కనువుగా నతఁడు పాడె. 25

పాడుచుండెడిపాటల భావ మేమొ!
పోవుచుండెడి యా శ్రోత్రపోక డేమొ!
తలఁచినంతనే యొడ లెల్లఁ బులకరించి
స్థిరసుఖానందడోలికఁ దేల్చి వైచు. 26

నన్నయార్యుఁ డెచ్చోటనే నాఁడె మైన
శబ్దసౌందర్యశాస్త్రముల్ చదివినాఁడు
తిక్కనార్యుఁ డీ భూమిలోఁ దిరిగి తిరిగి
జీవకళ వోయుశిల్పాన సిద్ధుఁ డాయె. 27

కవితాదేవత శారదాహృదయసౌగంధప్రసూనావళిన్
వివిధాలంకృతవేషభూషణములన్ వీణావినోదాత్మ యై
వివశత్వంబునఁ బాడుచుం దిరిగె నావిద్యావతీహావభా
వవిలాసంబు తెలుంగు నారసికుఁ డీ భద్రాసనారూఢుఁ డౌ. 28

వానికవితాప్రపంచప్రభావమునకు
గండపెండేరముల్ గల్లు గల్లనంగఁ
బలుకుపూఁబోడి కాళ్ళ గజ్జెలవిధాన
శ్రావ్య మై వినిపించు నీ ప్రాంగణమున. 29

భారతజాతి కా యమృతభాండము దైవతభాష జీవనా
ధారము భారతీహృదయదర్పణ మా నిఁక దాక్షిణాత్యభా
షారమణీమణుల్ మధురసాకృతు లందు మనోజ్ఞ మల్లికా
హారరసప్రవాహిని సుధాంబుధి లక్ష్మి తెలుంగుబాసయున్. 30

శివము సౌందర్యయుక్తమై చెలఁగునటుల
సంస్కృతీశక్తి తెలుఁగుల చలువఁదనము
మిళితమై కైత సెప్పినమేటి కిచట
గండపెండేర మిచ్చి యీఁగద్దె నిత్తు. 31

కవితారాజ్యము నేలుకోఁ గలకళాఖండప్రభావాత్ముఁ డీ
భవనంబందు సుధీజనుల్ వొగడఁగాఁ బట్టాభిషిక్తుం డగున్
ఎవరైనన్ సరె లేచి రండు రసతంత్రీవాద్యమున్ మీటి మా
వమాధుర్యము లొల్కఁజేయుఁ డను చారాజేంద్రుఁ డర్థింపఁగన్.

సభలో మూఁగినయెల్లవార లధికాశ్చర్యాత్ములై నోరు వి
ప్ప భయం బందిరి పండితప్రభుల యార్భాటంబులుం దగ్గె నిం
క భవిష్యద్గతి యెట్టు లంచు రసికుల్ కంగారులో మున్గి రెం
భ యోతాప్పాత మటంచు సత్కవులు చింతాక్రాంతులై రంతటన్.

కృష్ణరాయలపల్కు లెటేఁగినక్షణములో
మల్లన్నగుండెలు ఝల్లు మనియె
స్తుతమతి యాకవిధూర్జటి పెద్దన
కవితావిపంచికై చెవులఁ జొనిపె
రామభద్రుఁడు పెద్దనామాత్యుముఖమునం
దాంధ్రినాట్యకళారహస్య మెటేఁగెఁ
జెఱునవ్వు మోముపైఁ జివురింప నందితి
మ్మనశక్తి పెద్దనామాత్యుఁ గలిసెఁ

దమకుఁ దగని దంచుఁ దమిళకర్ణాటసం
స్కృతకవీంద్రు లెల్లఁ జేరకుండి
రల్లసానిపెద్దనామాత్యుఁ డటు నిటు
కలయఁ జూచె వేయికనుల సభను. 34

రాజసభాంతరాళమునఁ బ్రాకినమూగతనంబు సూచి వి
భ్రాజితకీర్తిశేఖరులు ప్రౌఢవచస్కులు సత్కవీంద్రులే
తేజము డిగ్గి మోము లిటు తెల్లఁగఁ బాలి కళావిహీనుఁ డౌ
రాజువిధంబు తోఁచె నని రాయలు బాధల స్రుక్కి చిట్లనెన్. 35

గద్దెయు గండపెండెరము కాన్కలు గాఁగ బహూకరింపఁగా
నొద్దిక నా కొసంగు మని యొక్కరు నిల్వఁగ లేరొకో! యనన్
'పెద్దనఁ బోలుసత్కవులు పృథ్విని లే రని నీ వెఱుంగవే.
పెద్దన కీఁ దలంచినను బేరిమి నా కిడు కృష్ణరాణ్ణృపా.' 36

అని పెద్దన గంభీర
స్వనమున వచియించి మానసాంభోజమునన్
వినుతించె శారదాంఘ్రులఁ
దన కవితాలతలఁ బూలతావులు గురియన్. 37

సద్యోజాతప్రవిమల
విద్యావిద్యుత్తరంగవిలసితుఁ డై కా
వ్యోద్యానము పుష్పింపఁగఁ
బద్యంబులఁ బెద్దనకవి పలుకఁగఁ దొడఁగెన్. 38

'పూఁత మెఱుంగులుం బసరుపూఁప బెడంగులుఁ జూపునట్టివా
కైతలు జగ్గునిగ్గు నెన గావలె గమ్మనఁ గమ్మన న్వలెన్
రాతిరియుం బవల్ మఱపురానిహొయల్ చెలియారజంపు ని
ద్దాతరితీపులం బలెను దారసిలన్వలె లోఁ దలంచినన్
బ్రాఁతిగఁ బైకొన న్వలెను బైదలికుత్తుకలోనిపల్లటీ
కూఁత లన న్వలెన్ సొగసుకోర్కులు రావలె నాలకించినన్
జేతికొలందిఁ గౌఁగిటను జేర్చినఁ గన్నియచిన్నిపొన్ని మే
ల్మూఁతలచన్నుదోయివలె ముచ్చట గావలెఁ బట్టి చూచినన్
డాతొడ నున్నమిన్నులమిటారపు ముద్దులగుమ్మకమ్మనో
వాతెఱదొండపండువలె వాచవి గావలెఁ బంట నూఁదినన్
గాతలఁ దమ్మిచూలిదొరకైవసపుంజవరాలిసిబ్బెపు
న్మేతెలియబ్బురంపు జిగినిబ్బరపుబ్బగుగబ్బిగుబ్బపొం
బూఁతల నున్నకాయ సరిపోఁడిమి కిన్నెర మెట్లబంతి సం
గాతపు సన్నబంతిబయకారపుఁ గన్నడగౌళపంతుకా
సాతతతానతానలపసం దివుటాడెడుగోట మీటు బల్
మ్రోఁతలునుం బలెన్ హరువు మొల్లము గావలె నచ్చతెన్గు లీ
రీతిగ, సంస్కృతంబు పచరించినపట్టున భారతీవధూ
టీతపనీయగర్భనికటీభవదాననపర్వసాహితీ
భౌతికనాటకప్రకరభారతభారతసమ్మతప్రభా
శీతనగాత్మజా గిరిజశేఖర శీతమయూఖరేఖికా
పాతసుధాప్రపూరబహుభంగఘుమంఘుమఘుంఘుమార్భటీ
జాతకతాళయుగ్మలయసంగతిచుంచువిపంచికామృదం
గాతతతేహితత్తహితహోధితదంధణధాణదింధిమి

ప్రాతనయానుకూలపదవారకుహూద్వహాహారికింకిణీ
నూతనఘుల్ఘులాచరణనూపురఝూళఝుళీమరందసం
ఘాతవియద్ధునీచకచకద్వికచోత్పలసారసంగ్రహా
యాతకుమారగంధవహహారిసుగంధవిలాసయుక్తమై
చేతము చల్లఁ జేయవలె జిల్లునఁ జల్లవలె న్మనోహర
ద్యోతకగోస్తనీఫలమధుద్రవగోఘృతపాయసప్రసా
రాతిరసప్రసారరుచిరప్రసరంబుగ సారెసారెకున్.'

పండితావళి యాశ్చర్యభరిత మయ్యె
రసికు లానందవీథిఁ బారాడి రంతఁ
గృష్ణరాయలు దేహ మొక్కింత మఱచెఁ
గవుల కమృతసేచన మయి కళలు దేరె.

ఆనందజలధిలో నమృతవీచీశబ్ద
మిది యంచుఁ బొగడె శ్రీకృష్ణవిభుఁడు
ఇది శరద్రాత్రిలో వెదఁజల్లుపుష్పసా
రభ్యంబు లనిరి కర్ణాటకవులు
ఇది వాణివీణలోఁ గదలినమృదులగీ
తాతరంగ మనిరి తమిళకవులు
ఇది ముగ్ధకాంతలహృదయంబులో రేఁగు
స్నిగ్ధత్వ మనిరి సంస్కృతకవీంద్రు
లాంధ్రకవితావసంతసంధ్యావనాల
గానవిద్యారహస్యంబు కంఠ మెత్తి
పాడుకొనుచున్నకోయిలపాట లనుచుఁ
బల్కి రాంధ్రకవిత్వతత్త్వజ్ఞు లచట.

అగణితకీర్తనల్ పెరుఁగ నత్యధికం బగుభక్తి గద్దెయున్
డిగి వినయంబుతో నట సుధీజను లెల్లరుఁ జూచుచుండ ము
ద్దగుతనచేతులన్ గవిపదంబులఁ బట్టి దొడింగెఁ గృష్ణరాడ్
సుగుణుఁడు గండపెండెరము చూచుచుఁ బెద్దనతోడ నిట్లనెన్.

నవసింహాసనకాంతిపుంజము భవన్నైపుణ్యముం జూచి యీ
కవితారాజ్యము నేలు మంచు నిను వేగం బిల్చె లెమ్మోయి యో
కవిరాజా! యని గద్దెపై నిలుపఁగాఁ గావ్యామృతాంభోధిలో
నవరాగంబులఁ బద్మగర్భునివలెన్ భాసించెఁ బెద్దన్నయున్. 43

ఇది శారదానికేతన
మిది కవితారాజ్యలక్ష్మి కిటపైఁ జిహ్నం
బిది శివమై సుందరమై
చదల నెగురు నని నృపుఁ డొక జెండా నెత్తెన్. 44

శరదిందుచంద్రికామయ
మరుణోదయఫుల్లమల్లికాహాసం బై
నిరతం బిది విజయం బై
సరస్వతీమూర్తికళలు చాటుచు నుండున్. 45

నావుడుఁ గవి గాంభీర్యపు
భావారంభప్రభూతి భాసింపన్ నా
యీ వైభవమే సర్వక
ళావైభవమై వెలుంగు లలితం బగుచున్. 46

నీపగిదిఁ గావ్యకళకై
స్థాపించినవారు గలరె సామ్రాజ్యంబుల్ ?
నీపగిది నెల్లభాషలఁ
దీపిని చవి చూచి పెంచుదివ్యులు గలరే ?

భవదుజ్జ్వలరక్తి నిలుచు
కవితాధాత్రిని సమస్తకళలు ఫలింపన్
జవిఁ జూచి తన్మధువు మా
నవతతి యమరత్వ మంది నవనవ లాడున్.

సౌందర్యతపోజనితా
నందరసాస్వాది! హృదయనైర్మల్యకళా
మందీభూతకృపామృత!
కుందస్వచ్ఛాద్భుతగుణకోటిగుళుచ్ఛా!

భోజుని కావ్యపోషణము పుక్కిటిగాథలు గాఁగ నెన్నియో
రాజ! మదీయకర్ణములఁ బ్రాకెను గాని త్వదీయపోషణో
త్తేజితరక్తి కన్నులకిదే కనుపించెను వాణి నీకు నీ
రాజన మీయ నీచరిత రమ్యముగా నుతియింతు రెల్లరున్.

అని శుభదాశీర్వాదము
లనునయమా స్తోత్రపాఠ మందెడిదిన మా
క్షణమున ముగిసెఁ గానీ
మనసులఁ బుష్పించెడిసభ మాయం బగునే? 51

ఇది ద్వితీయాశ్వాసము.

---

ప్రకృతిపురుషుల లీలాతరంగతతులఁ
దేల నుండెడియానందవేళ నొసఁగు
విప్రలంభశృంగార మీవీణ విరిసె
రసమొ యానందభైరవీరాగ మయ్యె.

# ఆనంద భైరవి

ఏదో తెల్పఁగ రానిబాధలఁ గలం చీ పుష్పితోద్యాన మీ
స్వాదుస్వచ్ఛతరంగభంగికలు నీ సంగీతమాధుర్య మీ
వేదారామలదివ్యగానములలో వీణాశ్రుతుల్ దోఁచియున్
మోదం బన్నది శూన్య మయ్యె బ్రతు కేమో! యెచ్చటో! తేలెడిన్.

రాగసంజ్ఞలు సరసిగర్భమున మూసె
గుసగుసల నేమొ! గాలుల గుట్టు దెలుపు
స్పష్ట మొనరింప దీ తుంగభద్ర హృదయ
వేదనం బగుగీతి విన్పించు నిచట. 2.

మండుటెండలు జగతినే మాడ్చుచుండఁ
గలువకన్నెలు నవ్వులఁ గులుకుకొనుచు
విసపుగాలుల నెత్తిపై విసరుచుండెఁ
జిత్రమై బాధలం దేల్చు సృష్టి యెల్ల. 3.

అనుభవవేద్య మాహృదయమందలి తీరనితీపిఖడ్గముల్
కనుఁగొనరానిరీతి ననుఁ గాటియ వెట్టు నరంబు లెల్లఁ ద్రుం
చు నని నృపుం డొకానొకమనోహరమంజులమందయానకై
ప్రణయతపంబులోఁ బవలు రాతిరియుం బడి తల్లడిల్లెడిన్. 4.

తడఁబడుగుండెచే నృపుఁడు తగ్గనితేజమునన్ సముద్రుఁ డై
యుడికెడియగ్నిపర్వతము లుండియుఁ జల్లఁదనంబు చల్లుచున్
సుడివడుగుండముల్ కలిగి, చూపుల కందక గట్లు ముత్తెపుం
సుడులకుఁ బ్రాణముల్ నిలిపి సూడ గభీరత వెల్గుచుండెడిన్. 5

అది యొకానొకపుష్పితోద్యానభూమి
రమ్య మగుశశికాంతహర్మ్యాగ్రమందు
హాయి గూర్చెడివెన్నెలరేయిలోన
నృపుఁ డిటునటు తిరుగుచుఁ జింతించె నిటుల. 6

అనురాగంబునఁ బెంచుస్నేహలతికోద్యానంబులో నెన్నియో
ప్రణయామోదాత్తమనోజ్ఞమల్లికలు సౌరభ్యంబులన్ నింపి హా
యిని గూర్పంగలవేళలో నెచటిదో యేతెంచె యీగాలివా
న నిరర్థం బొనరించె నాబ్రతుకు శూన్యం బయ్యెఁ బూఁదోటయున్.

తుదకు దిశ కొక్క టౌచుఁ బూదోయి విఱుగఁ
జేరఁదీసినగాలియే చెదరఁ గొట్టె
దరికిఁ జేర్చి లాలించి దగ్ధంబు సలుప
నేమి పున్నెమో! విధిచేఁత లెవ్వఁ డెఱుఁగు. 8

వలచి వలపించురాజ్యసౌభాగ్యలక్ష్మి
నెటుల కా దని త్యజియింతు నెటు భరింతు
వలచి వలపించుసౌందర్యప్రణయవల్లి
నెటుల కా దందు నేరీతి నెద ధరింతు. 9

గురుని యప్పాజి యాజ్ఞలఁ గూలఁద్రోసి
రాజ్యలక్ష్మిని వదలుధైర్యంబు లేదు
ఎదురుచూపుల నారాక యెద దలంచు
నమృతలక్ష్మిని మఱచుస్థైర్యంబు లేదు. 10

అని యనుమానమానసవిహాయసవీథిఁ జరింపు చెట్టులో
దినముల నెట్టుచున్ నృపుఁడు తీరనిపూర్వపురాగవల్లరుల్
పెనఁగొనుచుండ నామనకవెల్గుల మాపటివేళ సౌధమం
దము నిలిచి ముందువెన్క లెటుతోఁచక యూఁగుచు నుండెనూహలన్.

వెలఁది తొలిసిగ్గుపొదల నావలపు విరిసెఁ
గాంతకడకంటఁ దొణఁకె నా కమ్మఁదనము
మగువగాఁ బండె జన్మజన్మాలతపము
అందునో లేక యాశల నణఁగు నేమొ! 12

మొగలిమొగ్గల నరవిచ్చుముద్దుఁగనుల
సోయగంబున ననుఁజూచిచూచి మధుర
సార్ద్రభావనాబలముచే నాదరించి
మాటలాడిన మగువను మఱచు టెటులు? 13

పడమటికొండకోనపయిఁ బైఁబడి పోవుచు సంజచీఁకటుల్
విడివిడిగా ముడుల్ వడుచు వీఁగుచుఁ దోఁగెడిపిల్లగాడ్పులన్
దడఁబడఁగాఁ దరంగముల తాకిడి కోర్చెడియేటిగట్టులన్
బెడమొగమైననుం గసరి వేసెడిలాలసమూర్తి దోఁచెడిన్. 14

తడఁబడుచున్న పాదములు తైతకలాడెడిపట్టుకుంచెలున్
జిడిముడిపాటులేనియెద చిందులు ద్రొక్కెడిపైఁడిపైటలో
సుడివడుభావముల్ చెవుల సోకెడిసోయగ మైనముంగురుల్
తడఁబడఁగా రహస్యసికతాతలి చేరదె? నాఁడు నొంటిమై. 15

తట్టి హృదయంబు మృదులహస్తమున లేపి
మోముపై మోము మూఁగ నోములు రచింప
నెగసి పడుచున్న పైటల నెదకు నీడ్చి
యెచటికో! యీడ్చుకొనిపోయె నెఱుఁగ నంత.

నోరు మెదల్ప లేదు పదనూపురముల్ ధ్వనియింపుచుండఁగా
నూరక పోవుచుంటి నెటకో! యెవరో! యనుప్రశ్న లేక మం
దారవనాంతరంబున సుధామయసైకతసీమలందు నన్
జేరఁగ వచ్చి నాహృదయసీమల రాగము లొల్కఁ బల్కుచున్.

మల్లెమొగ్గలసాక్షిగా మఱవ నంచు
బాస సేయించుకొనిన యప్పద్మనయన
హృదయవల్లిక నేరీతిఁ ద్రెంతు నంచు
రగులుకొను ప్రణయాగ్నిపర్వతము ప్రేల. 18

ఆప్రదోషయామినీ ప్రసన్నసుహాస
రేఖలందుఁ బులకరింప శాంతి
'నీ మనోజ్ఞ రాగనీలాంబరమున జ్యో
త్స్నాతపస్వి నౌచు నడతు నంటి'. 19

చందనసౌరభం బలరుశ్యామల మైనప్రశాంతవాటికా
నందనభూములందు విడనాడని ప్రేమమధుప్రసూనముల్
చిందెడినవ్వులో మధురసీధువు లానఁగ వచ్చుచుండ నే
మందు దయామయీ! అమృతమందు విషంబును బోసి రెవ్వరో!

నీ నవకోమలాంఘ్రులకు నిగ్గులు దేరఁగఁ బూజ సేయ ను
ద్యానవనాంతరంబుల పదంబులు వ్రాలఁగఁ బోతి కాని సం
ధ్యానవమల్లి కామధుసుధారసధారలు చింది పోయె దుః
ఖానలదగ్ధ మై యెద భయంబునఁ దొట్రిలుచుండె నో సఖి! 21

గరువము లేని నీ కనులకాంతులు దొట్రిలుచుండఁగా మనో
హరమధురార్ద్రభావముల కంకిత మై యెద సుళ్లు వెట్ట సుం
దరవదనారవింద మమృతత్వము నాపయిఁ జిల్కు నంచు నీ
విరహవిపంచికాశ్రుతులె వీనులఁ జిల్లులు చేసె నో సఖీ! 22

చిఱునవ్వుల వెదఁజల్లుచు
నరవిచ్చెడి మొగలిమొగ్గ కందము దిద్దన్
సరి వచ్చెడి నీ కాంతులె
యురవడిఁ బుట్టించె నాకు నుబలాటముతో. 23

అదిగో నీ సుకుమారసుందరశుభాస్యానందపుంజంబు లీ
మధుమాసోదయసాంధ్యరాగములలో మందస్మితాబ్జంబు లై
హృదయోన్మీలితప్రేమభావముల నన్నేడ్పించి యేడ్పించి యీ
మృదుశయ్యాస్థలిఁ బాఱవై చెను సఖీ! మే నెల్లఁ గంపింపఁగన్.

మోహన మైన నీ పెదవి ముద్దులతీపిదనంబులో జగ
న్మోహనమూర్తి నై వెలిఁగి పోయెద నంచు నుషోదయంబునం
దూహల నిల్పికొంటిని నయోమయజీవితరంగమందు ను
త్సాహము త్రెంప లేక యిటు స్వప్నసుఖంబులఁ దేలిపోయెదన్.

రంభాతిరస్కారరమణీయతాశక్తి
కేమి యర్పించిన నీయ వచ్చు
నా భావగాంభీర్య మరయ నీ జగతినే
పాలించు నన్నప్రాభవము దోఁచు
నాశల రేఁపెడియానిండుసొగసులే
రాతిలో నానందరసము పిండు
నాహ్లాద మందించునాలేఁత నవ్వులం
గిలకొట్ట నమృతంబు పులకరించుఁ
బ్రణయమాధుర్య మొలుకు నా మనసు నౌర!
యెన్ని జన్మాల ఫలితమో యెవ్వఁ డెఱుఁగు
దక్కినయమృతభాండంబు తగులఁ బడియెఁ
గోరి కోసినపూవులు జాఱి పోయె! 26

దరులం దన్నుచు నేటిపాలతరఁగల్ దైన్యంబు సూచింప నా
మరులన్ రేఁపుచుఁ బోవుచున్ననదితో మాటాడ నుంకించినన్
బరుగుల్ తీయుచు మాయ మయ్యె బ్రతుకే పాషాణమయ్యెన్ మహీ
శ్వరుఁడై పుట్టుట యెంత పాప మను చాచంద్రున్ విలోకింపఁగాన్.

తెరలో దాఁగినచందమామ మరలన్ దీనాస్యతం బల్కె సుం
దరశారీరమనఃప్రవృత్తు లెపుడున్ దర్శించి భోగింపఁ జన్
వెఱపుం బోయెడిప్రేమహీను డొకఁ డేనిన్ లేఁడు నిన్ దప్పఁగా
సరసాలాపము చేయుకోయిలకు విశ్వాసంబు లే దాయెనే. 28

అని హృదయాకాశములో
వినిపింపఁగ నీవిశాలవిశ్వము నెల్లన్
క్షణమున మాయం బై తన
కనులం గనుపించె నొక్క కాంతామణియే. 29

మనుజసంచార మంతయు నణఁగుచుండ
గూళ్లలో మాంద్య మగుచుండఁ గూఁత లెల్ల
గుండెవలె నేటికెరటాలు కొట్టుకొనఁగ
ముసుఁగులో రాజు ముందుకుఁ బోవుచుండె. 30

అచ్చటఁ బాలసెజ్జపయి నంతు నెఱుంగనియాత్మవేదనల్
అచ్చపలాయతాక్షి నను రంచు సెబా సని మెచ్చు నార! యే
మిచ్చిన నీయవచ్చు నిఁక నేటికి జన్మ మటంచుఁ దూలుచున్
హెచ్చినతాపవహ్ని యెడ లెల్లఁ దపింపఁ దలంచె నిట్టులన్. 31

ముసురుభావాంబుదంబుల మూఁగనోముల
సిగ్గుచేలను లాగుచిన్నవాఁడు
సాంధ్యరాగంబున సరసామృతస్నాన
మాడించుమన్మనోహరవిభుండు
అచట నా సోదరింట నరవిచ్చుకనుదోయి
కందంబు దిద్దినయందగాఁడు
క్షణములో నేతెంతు నని నాఁటి కే మేమొ!
వినిపించి పోయినపెద్దమనిషి

తిరిగి చూడఁడే యీ వైపు మఱలి రాఁడె!
మఱచెనో! యేమొ నాఁటియామనకసంజె
నాఁటి యాపుష్పవాటి యానాఁటి మాట
యేమి సేయుదు నాకర్మ మింతె యేమొ! 32

ప్రణయమధువుకై హృదయపాత్రను ధరించి
బిచ్చ మెత్తిననాఁటి యీ బిగువు నింత
మనసు నెచ్చోట దాఁగెనో మది నెఱుంగ
నెంతలో నెంత లై పోయె నేమి సేతు. 33

ఆసామి నూనూఁగుమీసాలలో నవ్వు
లా వసంతుని మద మైన నడఁచు
నా భోగిభాగ్యమం దణఁగులావణ్య మా
రంభామనోహరుజంభ మడఁచు
నా రాచఠీవియం దలరుగాంభీర్య మా
సురపతిసూనుని స్రుక్కఁ జేయు
నా మూర్తిసౌందర్యమం దొప్పునాహ్లాద
మానిండుజాబిల్లి నైన గెలుచు

నన్నిటికి మించు నా హృదయంబు దలఁప
నౌర పూలబిడ్డలకంటె నతిమృదులము
జన్మజన్మాల వాసనాసౌరభ మయి
మన్మథుని గెల్చి స్వామినే మఱచు టెటుల. 34

అనుకోన రానిరాజ్యవ్యవహారముల్
రానీయ వేమొ! నారాజు నిటకు
నవ్వాజి యే మైన నదలించెనో! యేమొ!
ప్రణయబాంధవ్యంబు భంగ మంద
భావ్యంబు గా దంచుఁ బ్రజలలో నే మైన
మాపొత్తు పొక్కెనో! మది దలంపఁ
దనుఁ దా నె యిటమీఁదఁ దగ దంచు నే మైన
నెద నెంచెనో! యేమొ! యెఱుఁగ నౌర!
చందమామతో పాటు నాస్వామి వచ్చి
వలపువెన్నెల గురియించి ప్రణయతత్త్వ
మణువణువులో రగుల్కొల్పునమృతమూర్తి
నేఁడు రాఁ డయ్యె నీవైపు చూడఁ డయ్యె. 35

అనయగార మాహృదయ మారసభావము లాదృగంచలం
బానిపుణత్వ మాబిగువు లాసరసోక్తులు నా విలాస మా
మేనిపసందు లాచిగురుమీసములం దొలకాడునవ్వు మా
మానధనంబులం గొనియె మ మ్మవమానము సేసె నీగతిన్. 36

మఱువఁగ రానిచూపు రసమంజుల మైనమనస్సు మాటలం
దరయని దేదియో యొక మహాద్భుతశక్తి శరీరచాలనం
బురవడిఁ గల్గఁ జేయురుచిరోజ్జ్వలరేఖ నృపాలు నేగతిన్
మఱతు నిఁ కేగతిన్ బ్రతికి మన్నన లంది చరింతు నిచ్చటన్.

తనుఁ దా ముంగురు లెల్లఁ దీర్చి సుమనోదామంబు గూర్పన్ మదా
త్మను గిల్గింతలు పెట్టి నావిదియచంద్రాంకంబు కస్తూరికా
ఘనసారంబులఁ దీర్చి ఫాలతలి క్రీఁగంటన్ విలోకించి కాం
త నమస్కారమున నీ మనోజ్ఞపు జగత్సౌందర్య మహామూర్తికిన్.

అని యింతల్ వచియింపు చొక్కపరి వీణాలాపనస్థాయిలో
నను నజ్ఞాతసుగంధబంధురసుఖానందంబునం దేల్చు నా
ప్రణయాస్వాదితరాగభోగరససామ్రాజ్యప్రభావజ్ఞ నే
మని నిందింతు నిఁ కేమనం గలుగు నే మంచున్ విధిన్ దూఱెదన్.

సోలుచుఁ జింతతో నెదురు సూచు, దిశల్ పరికించుఁ, బువ్వులన్
రాలెడిపుప్పొడుల్ ప్రణయరాజ్యపుటాశలు రేఁప మీలితో
న్మీలితనేత్ర యై ముగుద నిల్చెఁ దటాలున మేడముంగలన్
దూలఁగ భావముల్ వలపు తొందర పెట్టఁగ మూర్ఛలోఁ బడెన్.

అపరచాణక్యుఁ డౌనప్పుజి యే మైన
వెన్నంటునో యనుభీతి గదుర
నెవ రైనఁ జూతురో! యేమొ! యటంచుఁ బి
కో! పికో! మని గుండె కొట్టుకొనఁగ
నరవిచ్చుకనులలో నందంబు వెదఁ జల్లు
ప్రియురాలి రూపంబు వేగిరింప
నిన్నాళ్లు నెచ్చోట నిది నేర్చినా రంచుఁ
గసరునో యేమొ! యాకాంత యనెడి.

దిగులు నొకవైపు గుండెలో దెబ్బ దీయ
నడుగడుగున గండంబుల గడపుకొనుచు
నదరి బెదరి చెదరి తుట్టతుదకు జేఁడు
జీవితేశ్వరి హృదయానఁ జిక్కుకొనియె. 41

అన్యదేశప్రవాసాగతప్రియునితో
మాటాడుకుల కాంతమనసువోలెఁ
జంద్రోదయారంభసమయంబునం బొంగి
యుల్లోల మగుచున్న యుదధివోలె
ఖయిదులోఁ జెఱపడ్డ కాంతుండు దరిఁ జేర
వివశ యౌజక్కవ పెంటివోలె
విడనిబంధంబులఁ విడిపించుకొని పర
మాత్మలోఁ జేరుజీవాత్మవోలెఁ
దెలుప కేతేరఁ జిన్నమ దేవికడకు
భావములు పొంగి హృదయంబు పరువు లెత్తెఁ
బ్రియుని రాయలయెద వ్రాలి వివశ యగుచు
నతనిలో లీన మై పోయె నా పడంతి. 42

మధుర మాస్వప్నంబు మాసిపోయెడివేళ
నలనల్ల మేల్కాంచునాత్మ లనఁగ
రమణీయ మా కావ్యరాజ్యంబులో నల్లఁ
జేరిపోయెడిరసజీవు లనఁగఁ

బుణ్యంబు నశియింప భూమిపై జనియింప
నరుదెంచుచున్న మహాత్ము లనఁగ
మసకచీఁకటు లెల్ల మాయమై పోవంగ
స్పష్టంబుగాఁ దోఁచుజగము లనఁగ
నంతు లేనియానందరసాబ్ధి మునుఁగు
నాప్రణయజీవు లలనల్ల నాత్మ లెఱిఁగి
క్రమముగా నొక్కరొకరి ముఖంబు లచటఁ
జూచుకొని జాలిచూపుల సోలి రంత. 43

సుందరసుకుమారసుమశోభితం బైన
ప్రియురాలియెడఁద కంపించుచుండ
దైన్యంబుతోఁ బరితప్త మౌహృదయమా
యరవిచ్చుకనుమొగ్గలందుఁ దోఁప
దీర్ఘనిశ్వాసము దీర్ఘమై యెదలోని
బాధ లేమేమియో బయలుపఱుప
గాలిలోఁ దేలునీలాలకంబులు ప్రభూ!
తమరక్తి యింతే గదా యటంచుఁ
జెదరు స్నేహాతపస్విని స్నిగ్ధహృదయ
మంతు లేనివగపుతీపి నందఁ జేయఁ
గృష్ణరాయలు ప్రియురాలి కేలు వట్టి
యల్ల నడయాడెఁ బుష్పితోద్యానభూమి. 40

ఎదలోని యీబాధ యెట్టిదో దేవ! యా
యమృతాంశు నొకయింత యడుగ రాదె
రాలినయీపూలరాశిగా నెన్ని యూ
శలు పుట్టి క్రుంగెనో తెలియ దాత్మ
యెంతగా మీరాక కీయెద యేడ్చెనో
స్వామి! పొంగారు నా సరసి సాక్షి
యెదఁ గఁడ్ల నిడుకొని యెంత వెదకితినో
యడుగుఁడీ పుష్పితోద్యానలక్ష్మి

యనుచు దైన్యభంగిమము లాయాత్మ దెలుప
నో ప్రభూ! మొగ్గ దొడిగినయీప్రణయల
తలిఁక నేమి యౌనో! యని తాళ లేక
పైట దడిపెఁ జిన్నమదేవి భ్రాంతికనులు. 45

తడిసినపైట నా ప్రభు నుదాత్తజనోచితప్రేమచిత్తముం
దడిపినఁ జేతులన్ సతిని దగ్గఱఁ జేరిచి బుజ్జగింపుచుం
బుడుకుచు మోము కంటఁగలము త్రెములన్ గొనగోటమీటుచున్
నుడివె నృపాలుఁ డాయెడ ననూనరసోదయవాగ్విలాసుఁడై. 46

తలఁపుల్ నిండిననీముఖం బిటులఁ గ్రిందన్ వ్రాల్చఁగా నేల నా
వలపుంబూఁతలు రాల నీ హృదయసౌభాగ్యంబు నీరీతిగాఁ
దలఁగం ద్రోయుచు దాఁచి పెట్టఁ దగునా ధైర్యంబులం గ్రుంగ న
వ్వుల లాలించుచు నెవ్వరేని నరకంబుం జూడఁ బోఁ ద్రోతురే ?

హృదయావేశరసార్ద్రభావముల నేకీభావముం జెందఁగా
మృదుషడ్జస్వరరాగమాలికల సంప్రీతాత్మ్యలం జేయ నా
మదనోత్సాహవిపంచికాశ్రుతులు సామాన్యంబులే ద్రెంచి వే
య దయాస్వాదితరాగభోగుఁ డిల నిందార్హుండు కా నేర్చునే! 48

పూచినపూలు రాలి పడి పోవుచు నుండె సమీరడింభకుం
డేచినయేపుల న్మఱల నేచుచు వచ్చుచు నుండెఁ బాలగాఁ
గాచినవెన్నెలల్ తఱిగెఁ గొంత! దయారసనేత్ర వై యిటన్
దాచని ప్రేమలన్ విరుల దాఁగము గూర్పఁగ రమ్ము నెచ్చెలీ! 49

రాలినపూలలోని మకరందము పూర్తిగఁ జింద లేదు ప
త్రాలకు సొంపు దిద్దుచు సుదర్శన మై కనుపించె బాల! కెం
గేలను జింది పోవక సఖీత్వము సార్థక మంద నావిరిన్
లాలన తోడి తెమ్మెదె విలాసముతో రుచి సూతు నిచ్చుటన్.

నిలిచీ నిలువనిరాగము
పలికీ పలుకనిలతాంగి పలుచని ప్రేమల్
తొలఁగీ తొలఁగనిమమతలు
కలిసీ కలియనిమనసులు కష్టము గాదే. 51

లలనా! కోమల మైననా హృదయవాల్లభ్యంబె గాదీ మహీ
స్థలి నెల్లన్ భవదంఘ్రిపద్మములచెంతన్ నిల్పి సేవింతు నా
పలుకుల్ నమ్మము లేనిచో హృదయదౌర్భాగ్యుండ నై నీమహో
జ్జ్వలసౌందర్యకళాప్రపంచము తపస్సంపన్నతం గెల్చెదన్. 52

పొదలలో ముండ్ల మొగ్గ నై వెదకువాఁడ
సరసిలోఁ గమలంబు నై తడుతు నింక
నింగిలో ధ్రువతార నై నెమకువాఁడ
నెన్ని జన్మ లీ సొగసుకై యెత్త వలెనొ! 53

వెన్నెల నై భవత్కళల విశ్వము నెల్లను వ్యాప్తి చేయుదున్
కిన్నర నై భవన్మధురగీతిక లన్నియు నాలపింతు నీ
తిన్ననిగాలులం గలిసి దేవి! భవద్గుణసౌరభంబు లే
యిన్నరజాతికిన్ దెలుప నే నిదె పోదు ననుగ్రహింపవే 54

అని యెదలోని రాగరస మంతయుఁ దొల్కఁగఁ బల్కఁ గల్కి నీ
ప్రణయపుభిక్షుకుం డిదె భవన్మృదుపాదపయోరుహద్వయిన్
మనసునఁ బట్టి కొల్చు నని మ్లానముఖంబున బెంగచూపులన్
గనుగొన జాలిలోఁ గరఁగి కాంతునిఁ గౌఁగిటఁ జేర్చు చల్లనన్.

ఇంకెడిగుండెలో నుబుకు లెత్తినరాగము పొంగి పొర్లఁగా
మంకులు జాఱ నామధురమార్దవ మైనమనోమయూరి న
ల్వంకల నాట్య మాడ రసభావవిలీనకృపాకటాక్ష మా
వంకకు జాఱ ముగ్ధ యయి పల్కుట కేమియు రాక నిల్చుచున్.

మబ్బులు విచ్చి పోవ సుకుమారశరీరము చంద్రవంకలో
నుబ్బుచుఁ జేరి పోవ మది నుత్తల మందెడిరీతిఁ గోరికల్
గొబ్బున రేఁగ నాహృదయకోమలతల్ చివురింప రాయలన్
అబ్బురపాటు వీడి నయనాంబుజముల్ వికసింపఁ జూచుచున్. 57

చూచీ చూడనిచూపుల
తోఁచీ తోఁచనితలంపు తొందర సేయన్
పూచీ పూయనిమనమున
దాచీదాచనిమరందధార లొలుకఁగన్. 58

ఇది యేటిమాట సఖుఁడా!
ముద మారఁగఁ బ్రియులఁ జేరి ముద్దాడక యే
హృదయంబుల విష మిచ్చుచు
మొద లంటఁగఁ ద్రెంచి వైచుమూర్ఖులు గలరే! 59

ఏ మందును బ్రియశీలుఁడ!
నీ మనసునఁ బుట్టి సన్న నిలుపనిమరులన్
గోమలహృదయం బిచ్చియు
నేమనసునఁ బల్కకుండ నేఁగెద నోయీ! 60

ఏమి సెప్పుదు స్వామి! నే నీయపూర్వ
ప్రణయలాలసదృశ్యసారాంశ మిచటఁ
జివురు లెత్తినప్రేమలో సిగ్గు లేక
మమత లెటు పుట్టుచుండునో మది నెఱుంగ. 61

తెలియనియాత్మబంధ మిది దేవ! య దెట్లులఁ ద్రెంతు మెన్ని జ
న్మలఁ బడి వచ్చుచుండెనో! మనంబు నెఱుంగ వియోగదుఃఖము
జ్వాలముగఁ బేర్చఁ దాళఁగలశక్తి గొకింతయు లేక బాధలన్
నలఁగుచుఁ బల్కనం దమరె నన్నిటు లై వెఱపింతు రేటికో?

స్వామీ! దైన్యము చిందు మీముఖము తప్తంబైన మీ భావ మే
నే మాత్రంబును జూడ లేను నను మీ రీరీతి బాధించి మీ
రే మేమో వచియింప నిల్వఁ గలనా యీదీనురాలిన్ ప్రభూ !
యే మైనన్ సరె ప్రోచి మీ హృదయమం దే నిల్పఁ బ్రార్థించెదన్.

క్షణమాత్రంబును మిమ్ము వీడి యిఁక నేకాంతస్థలావాస మీ
దినగండంబుల నీముసుంగుబ్రతుకుల్ ద్రెళ్ళింప లే నంచు నా
వనితారత్నము పూవువోలెఁ బతి దా వక్షస్థలిన్ వ్రాలె నా
మనసుల్ దేలె ననంత మోహమధుర సామ్రాజ్యంబునం దేక మై.

చెదరినముంగురుల్ సరిది చెక్కున చెక్కును జేర్చి ప్రేమతో
నెద యెద నింక నాత్మహృదయేశ్వరి భావము లెల్ల బాధలే
యొదవఁగఁగఁ జేయ నాతఁ డెదియో త్రుటి యోజన జేసి యిట్లనెన్
హృదయసుమంబ! నేఁటి మన యీ వెత లింక నదృశ్య మయ్యెడిన్.

లలితోద్యానపుఁ బుష్పవాటికల నీలావణ్యలక్ష్మిద్యుగం
చలచాంచల్యమనోజ్ఞరాగలతికల్ చంద్రాతపస్నానముం
గలుగం జేయఁగ నెల్ల వేళల భవత్కల్యాణరూపంబు చూ
పుల లాలించుచు నా మనోగృహమునం బూజించి సేవించెదన్.

పూలకై నందనోద్యానభూమి కేఁగి
ముండ్లు కల వని మరలెడిమూర్ఖుఁ డెవఁడొ !
దరికి లాగెడిపూవుల తావి గొనక
తేనెల రసవిహీనుఁ డై త్రెంచు నెవఁడొ ! 67

నీకై యీలవలీవనాంతరములన్ నిర్మింపఁగా లే దిటన్
రాకాచంద్రుఁడు నవ్యపూల నిశలన్ రాజిల్లఁగా లేదు సం
ధ్యాకాంతుల్ సెలయేటిపాటలు సుఖాహ్లాదంబులం గూర్పవే
యే కాలంబుల నెంద ఱెంద రిటఁ దా మెట్టెట్టు భోగించిరో! 68

యోగవియోగంబులు మన
రాగద్వేషముల కంచుఁ బ్రభవింప నిటన్
భోగించుచు శోకించుచు
యోగంబుల నెఱప వలయు నోరిమితోడన్. 69

మనయీజీవితసంధ్య రాగమయ మై మాధుర్య మై యాత్మసం
జనితానందపదప్రదం బయి మహాత్సౌభాగ్యముం గూర్చు నం
చును శుక్రుం డిదె దిక్సతీతిలక మై జ్యోతిర్మయుం డై వెలిం
గె నభోవీథి సువర్ణహారతు లొసంగెం బూర్వదిక్కాంతయున్.

అనతికాలంబునందె నాయాత్మభవన
మందు నినుఁ జేర్చి యర్చింతు నంతదనుకఁ
దగనియూహలఁ బెంచుచు దిగులు వడుచుఁ
దెగనిబాధల నన్ను వేధింప కబల! 71

అని విడ లేక యెట్లో ప్రియురాలి మనోహరకేళికావనం
బును విడి సందుగొందుల నపూర్వపథంబున శీఘ్రగామి యై
మనము భయంబునన్ వడఁక మానవనాథుఁడు పోవుచుండ వెం
టనె పడె మంత్రివర్యుఁడు హటాత్తుగఁ జూచిససంభ్రమాత్ముఁ డై.

నృపతీ! నిల్వ్వము వచ్చుచుంటి ననఁగా హృద్వేగముం బ్రాజ మో
ముపయిన్ దైన్యము గ్రమ్మఁ జూపు చెదరెన్ ముచ్చెమ్మటల్ పోసెనే
విపరీతం బొనఁగూడునో యనుచుఁ బృథ్వీశుండు మంత్రప్రభా
వఫణీంద్రుం డన నట్టులే నిలిచె నప్పాజీ వెలుంగున్ వినన్. 73

జారచోరుల బంధింపఁ జాల మంచుఁ
బ్రభువులే మమ్ము నమ్మ కిప్పగిది రాత్రి
వేళఁ బ్రచ్ఛన్నవేషు లై వీధులఁ బడఁ
బరువు దప్పె మా కేటి కీబ్రతుకు లింక. 74

అని నిట్టూర్పులతోడ జేనిహృదయం బాందోళనల్ రేఁగ మె
త్తనివాగ్భల్లము లల్లనం జొనుప వే తబ్బిబ్బు లై కృష్ణరా
ణ్మణి యప్పాజి! యటంచు మంత్రిపదపద్మద్వంద్వమున్ వ్రాలి భో
రన నేడ్చెన్ బసిపాపరీతి నృపుచర్యల్ సూచి యప్పాజియున్.

కాళులపైఁ బడి యేడ్చునృ
పాలుని వెస లేవఁ దీసి పలుకక తన మం
త్రాలయమునకుం దోడ్కొని
జాలం బొనరింపకుండ సచివుం డేఁగెన్. 76

చింతాక్రాంతుం డై తన
స్వాంతం బురియాడుచుండ సమ్రాట్టు రహా
స్యాంతరకృత్యముల గృహా
భ్యంతరమున ముందువెన్క లరసెడివేళన్. 77

తడి లేనినాల్క దడుపుచుఁ
దడఁబడునెద నొక్కరీతిఁ దట్టార్చుచు న
ప్పుడ పుడమిఱేఁడు మనసే
ర్పడఁ దిమ్మరుసయ్య కెల్లఁ బల్కం దొడఁగెన్. 78

సున్నిత మైన నా హృదయశోభనవల్లిక ద్రెంచు ధైర్యసం
పన్నత లేని నేరమునఁ బాల్పడితిన్ దమ చేతులార మీ
రిన్ని దినంబులం బెనిచి యింత నొనర్చినవాని నింక వి
చ్ఛిన్న మొనర్తురో ప్రణయసేతువు నిల్పఁ బరిశ్రమింతురో! 79

అని దృఢనిశ్చయుం డగుచు నాత్మ బయల్పడఁ బల్కు కృష్ణరా
యని యెద రాజ్యలక్ష్మిఁ బ్రజ నంతయు నాత్మ దలంపుచుండఁ బెం
చినమమకారముల్ పెరుగఁ జేతుల వీపును దట్టుచి ట్లనెన్
బ్రణయము రాగభోగముల భంగ మెఱుంగనిదివ్య మానయా.

ఓయీ! సౌందర్యపిపా
సీ! యివి యేటి సరసమ్ము లెవరేని వినన్
నీయారాటము మెత్తురె?
ప్రాయపుఁబొంగులకు వావివరుసలు లేవే? 81

నీ సౌందర్యోపాసన
లీ సరి యగు టుచిత మగునె? యే మనఁ గల నా
యాసం బగు నీ చర్యల
నీ సిగ్గులె పూచి కడకు నీరస మయ్యెన్. 82

కామ మానందకల్పవృక్షంబునకును
సకలదుఃఖంపుటడవికి జన్మభూమి
మనకృషి ననుసరించి ధర్మార్థమోక్ష
ములు విరియు లేనిచోఁ గ్రోధమ్ముఁ జ్వలించు. 83

మహదానందకరం బై
మహిమోన్నత మై యనంతమధురాత్మక మై
మహి కాధారం బగున
త్సహానాత్మక మైన ప్రేమ శాశ్వత మోయీ! 84

తత్కృతంబున నెందఱో దానికొఱకు
ముక్కు మూసి తపస్సున మునిఁగినారు
దానియంచుల నేకవి దాఁట లేక
యూహ కెగఁ బ్రాకుచుండె నీ యుర్విపైన. 85

దానినీడనే వదలనితపసి యొకఁడు
దానిఁ జూడనే చూడనిదీనుఁ డొకఁడు
దానిఁ జూచియుఁ జూడనిధన్యుఁ డొకఁడు
నాయనా! ప్రేమరీతు లనంత మోయి! 86

చిటికలమీఁద మీపనులఁ జేయఁగ నేర్తుము గాని రాజ! యం
త్రట మనకార్యముం దెగునొ! దైవము మెచ్చునొ! శాంతి సౌఖ్య మె
ప్పటివలె నిల్చునో బ్రతుకు బండలు గాఁగ జగంబు రేఁగునో
కటకట! భారతాభ్యుదయకర్మము లే మయి పోవునో కదా!

సరసవిలాసలాలసరసప్రణయాంబుధి మున్గి రాజ్యమే
మఱచి మెలంగెదో! ప్రజల మార్గము తప్పెదో! నీ స్వధర్మ శే
కరణి నొనర్చెదో! యని వికాసము లేక విచారసాగరో
ద్ధరతరమానసాబ్జుఁ డయి తల్లడ మందుచు మంత్రి నిల్వఁగన్.

అనుపమవేదనాహృదయ మంతయుఁ జూచి నృపాలుఁ డిట్లనెన్
గనులకు ఱెప్పవోలెఁ బ్రజఁ గావఁ దలంతు విధిప్రయుక్త మా
పనులను నిర్వహింతుఁ దమపాదము లాన మహాత్మ! నమ్ముఁడీ
ప్రణయము భారతాభ్యుదయభంగ మొనర్పక చూచుకొందుఁ గా.

చిఱుతతనంబునుండి యొడిఁ జేర్చి యభీప్సితలక్ష్యసిద్ధికై
నిరతము రాజ్యతంత్రముల నిశ్చలకర్మతపస్సమాధి నీ
తరుణముదాఁక నం గననితండ్రిగఁ బెంచినప్రేమమూర్తి! నా
పరువముఁ బ్రాణముల్ నిలుపుప్రజ్ఞదయాహృదయంబు మీరనన్.

కడుపున రేఁగుతీపి తన కన్నులఁ జల్లఁదనంబు చల్ల ప్రా
న్పడునరపాలుఁ జూచి ప్రియవాక్కుల మంత్రివరుండు చింతలం
దడలకు మయ్య! మీహృదయమందలి కోరిక దీరుఁ, గాని యీ
పుడమికి రాజ్ఞి యై ప్రజలపూజలఁ గన్నడలక్ష్మి యందెడున్.

వంశపరంపరాగతతవచ్చుచు నుండెడిసంప్రదాయ మీ
యంశమునందు మాఱు మరియాదకు భంగమె కాక రాజ్యమే
ధ్వంస మొనర్చుశక్తు లిటు దార్కొనవచ్చుఁ బ్రజానురక్తి రా
డ్వంశపుమూలశక్తి నరపాలుఁ డవశ్యముఁ దీర్పఁగావలెన్. 92

ఎదపైఁ గ్రమ్మినదుఃఖాం
బుదములు కరఁగి కనుఁగొనల మోదాశ్రువు లై
చెదరఁగ నృపుని ముఖాబ్జము
వెదఁజల్లు చలంతినవ్వు విరియ విభుఁ డనెన్. 93

అప్పాజీ! మీపల్కుల
నొప్పెడిభావంబు విధినియుక్తం బది మే
మెప్పగిది దాఁటఁ గల? మె
ల్లప్పుడు భవదీప్సితమె శుభావహ మనఁగన్. 94

తొలుదొల్తన్ మీరలు తిరు
మలదేవిం బెండ్లి యాడి మఱలఁ దమమదిన్
వలపించినప్రియురాలిని
వలసినగతిఁ బెండ్లి యాడ వచ్చు నృపాలా! 95

తగుయత్నం బొనరించెదఁ
దగినవిధంబున మెలంగఁ దగు నన్న వృథా
యగు నేమో మాపల్కులు
జగదీశులపట్ల ననుచు సచివుం డనఁగన్. 96

తమయాజ్ఞ లేక యీ జ
న్మములో నిఁక నగరు విడిచి నడవ మహాత్మా!
తమరే యిటు మాదౌర్బ
ల్య మెఱిఁగియుఁ బలుక మాటలాడం గలమే? 97

అనుచు వినమితోత్తమాంగుఁ డై హృదయదా
ర్బల్య మొందునీ నృపాలు నింక
మంత్రివర్యు లెటుల మన్నించి ప్రోతురో !
యని విభుండు నగరి కరిగె నంత. 98

సుముహూర్తంబున మంత్రిప్రోద్బలముచే శుంభద్విభూషాంగుఁ డై
యమితోత్సాహముతోడ రాయలు వివాహం బయ్యెఁ గర్ణాటరా
జ్యముఁ బాలించుకుమారవీరదుహితన్ సౌందర్యలక్ష్మిన్ మహా
విమలోదాత్తమనీష యాతిరుమలన్ వీణావినోదాంగనన్. 99

అన్నముఁ బున్నముం దెలియనంతటి పాయపుఁ బాలపొంగులన్
జిన్నెలు దిద్దుకొన్న నవజీవనరాగరసాంకురప్రభల్
గ్రొన్నన లెత్త నాప్రణయకూజితముల్ వినిపింప రాయ లా
చిన్నమదేవిఁ బెండ్లి యయి చిత్తముఁ బట్టి సుఖించె నంతటన్.

తిరుమలదేవి ప్రాభవముఁ దీయనిచిన్నమదేవిరాగముల్
మఱువనిఠీవియున్ బ్రణయమాధురులన్ గురియింప దేశమున్
మఱచుచు దేహమున్ మఱచి మన్నన లందుచు నెల్లవేళలం
దిరువురఁ గూడి కృష్ణనృపుఁ డెంతయు సౌఖ్యరసాబ్ధిఁ దేలెడిన్.

కంచ మొకటి గాఁగఁ గర్ణాటకాంధ్రుల
మంచ మొకటి యయ్యె మహి సుఖింపఁ
ప్రభుని కోర్కెఁ దీరె భారతాభ్యుదయమ్ము
తిమ్మరుసుతలంపు తీవ లెత్తె. 102

ఇది తృతీయాశ్వాసము.

---

పటుగజాశ్వయోధబంధురప్రతితోడః
నడుము గట్టి నడచునాయకాళి
గర్వ మిూపిపంచి కదనకుతూహల
రాగసరణిఁ బాడుఁ బ్రజలు మెచ్చ.-

# కదనకుతూహలము

సకలారాతిబలంబులం గలరహస్యానేకఘట్టంబులుం
బెకలింపంబడె గూఢచారినిశితావిర్భావభావస్థితిన్
అకలంకప్రతిభాప్రభావయుతుఁ డౌనప్పాజిధీయుక్తి నా
శ్వికసేనానికరంబు పెంపఁ బడియెన్ విశ్వంబు లల్లాడఁగన్. 1

ప్రజలలోఁ దల యెత్తు భావనాబలముల
నంటి యంటకయె యాద్యంత మెఱుఁగుఁ
గాలు కదల్పకే కనులలోఁ గను వెట్టి
సామంతనృపుల విశ్వాస మెఱుఁగు
సైన్యాధిపతుల సంచలనక్రమంబులం
దడుగుజాడల నిశ్చితార్థ మెఱుఁగు
శత్రురహస్యసంచారదక్షుల జీవ
నాడులయంతు క్షణం బెఱుంగు
మనసుమర్మంబు కనుపాప మరఁగులోనఁ
దఱచి శత్రుతంత్రంబుల తత్త్వ మరసి
రాజ్యసంరక్షణకు సహస్రాక్షుఁ డగుచు
నృపుని మనసులో మనసుగా నిలిచె మంత్రి. 2

మూలబలంబు పెంచె నలుమూలల శోధన చేసి రాజ్యాల
క్ష్మాలలనాస్వరూపము రచించె మనఃస్థితమర్మకర్మముల్
కాలుని కైన గోచరము కానివిధాన మెలంగెఁ గృష్ణభూ
పాలుని కార్యఖడ్గములు ప్రాభవ మందఁ బరిశ్రమించెడిన్. 3

స్థలజలవనగిరిదుర్గం
బుల నెల్లను భద్రపఱిచి ముట్టడి గొనుశ
త్రుల ఖడ్గశిలావర్షం
బుల నడచెడిపాశయంత్రముల నెలకొల్పెన్. 4

దొరమన్నీలను బాళెగాండ్రను మహాదుర్గాధినాథావళిన్
సరగున్ రమ్మని యాజ్ఞలం బనుపఁగా సైన్యంబులం గూర్చుతి
మ్మరుసా డెబ్బదిరెండుమండలములం బాలించుసామంతు లం
దఱు నేతెంచి యొకొక్కరే ప్రణతులై దర్శించి రప్పాజినిన్. 5

సాదరోదారుఁడై మంత్రి సకలనృపులఁ
జూచి యుచితాసనములఁ గూర్చుండఁ జేసి
నవ్వుమొగమున నృపుల మనంబు లరసి
మధురవాక్కుల హృదయమర్మములఁ దఱచె. 6

దొర లామీకు సుఖంబె? మీ ప్రజకు సంతోషంబె? చోరాదిము
ష్కరబాధల్ తమ భూమిఁ బుట్టవుగదా! సమ్రాట్టు లౌకృష్ణభూ
వరుధర్మంబు ప్రజానురక్తి తమభూభాగంబులం శాంతి కా
కరమై నిల్చెనె? పాడిపంటలకు భంగం బింతయున్ లేదు గా? 7

రాయలయాజ్ఞలన్ నడపుప్రాభవమూర్తుల మిమ్ము మీప్రజల్
న్యాయముతోడఁ గొల్తురు గదా! విసిగింపక వత్సరాంతకం
దాయఫలంబు లిత్తురు గదా! యొక కేనియుఁ దప్పకుండ మీ
రీ యెడఁ దీర్చు మీ విధుల నెల్లను దీర్తు రటంచు నెంతు నాన్.

ప్రణయోదారవచస్సులన్ దొరలు కంపం బంది మున్ముందు చే
సిననేరంబులు పొక్కి నేఁడు మన కేశిషుల్ తలన్ వ్రాలునో
యని చింతించి నమస్కృతుల్ సలిపి యోయప్రాజ్ఞ! మే మొక్క కా
సును జెల్లింపము చక్రవర్తి కనుచున్ శోకాత్ము లై నిల్చుచున్.

చల్ల నగువాక్కు గుండెకు బల్లె మయ్యెఁ
గుశల మగుప్రశ్న కొంపలఁ గూల్చి వైచె
తప్పు చేసినహృదయాలు తల్లడిల్లె లా
వడకఁడే దొంగ రక్షకభటునిఁ జూచి. 10

ప్రభుని ధర్మానురక్తిచేఁ బ్రజలపైఁ బ
ఱచుదయారసం బెంత మాత్రంబు స్వామి!
ప్రకృతిచే భంగపడదు మీ ప్రజలయందు
వెదకి చూచినఁ దప్పు కన్పింప దెపుడు. 11

ప్రజల భక్తికిఁ బ్రభుని ధర్మగుణమునకు
మధ్య నిలిచియు ద్రోహు లౌమన్నదొరలె
మమ్ము శిక్షింతురో లేక మధురమార్ద
వ మగుమనసుతో రాతురో పాప మెల్ల. 12

తప్పు దెలిసి పశ్చాత్తాపదావవహ్ని
భస్మ మై పోవుసామంతప్రభువు లంత
మంత్రిమాధుర్యరసముచే మరల బ్రతికి
స్వామిభక్తిస్వరూపు లై జాలువాఱ. 13

ప్రజలభక్తికి ప్రభునిధర్మగుణమునకు
మధ్యఁ జిక్కి మీ ద్రోహాలు మాడి పోయె
స్వామిభక్తిలో సత్యరసస్వరూపు
లై జ్వలించెడిమిముఁ జూడ హాయి గూర్చె. 14

తప్పు సేయుట మర్త్యధర్మంబె దానిఁ
దెలిసి సవరించుకొను టన్న దివ్యశక్తి
మలిన మెరియుకొలంది నైర్మల్య మంత
కంత కుద్దీప్త మై జగం బంత వెలుఁగు. 15

ఎన్నఁగా రానిమీచేఁత లెల్ల మీ హృ
దయ మరసిన మా బుద్ధి కర్థంబు లగును
కాని ప్రజ కిది తప్పుగాఁ గానుపించుఁ
బ్రజలఁ బట్టి ప్రభుత్వంబు బ్రతుకుఁ గాదె? 16

ప్రభుఁడు ధర్మంబు పాలించుపట్లఁ బ్రజల
సేమ మాత్మలోఁ దలపోసి చిన్న దయ్యుఁ
దెలిసి తెలియక సేయున దెట్టి దైన
ధర్మ మెఱిఁగి వర్తింపఁగాఁ దగును గాదె? 17

మీ సుగుణంబులున్ దెలియు మీప్రభుభక్తియు గోచరంబు వి
శ్వాసవిధేయులౌ తమ ప్రవర్తన మంతయుఁ జూచి కాదె మే
మీ సమయంబుదాఁక నొక కేనియు నెత్తక యుంట నేఁటి మీ
దోసము లెల్ల సైచి దయతో నృపుఁ డేలెడిత్రోవ తెల్పెదన్.

పదియేండ్లయ్యెను బన్నులున్ నిలిచె నా బాకీలకై సైన్యసం
పదలం దర్థము చెల్లు పెట్టుఁ డనఁగాఁ బ్రఖ్యాతిగాఁ దిన్నమ
న్నెవారల్ దానికి సమ్మతించిరి భటానేకంబు యుద్ధాశ్వముల్
మదమాతంగము లెల్ల మంత్రిధిషణామాహాత్మ్యమున్ గూడెన్.

నగరి వశ మయ్యె నేనూరు నాగబలము
పదియు రెండువేల తురంగబలము లక్ష
కాల్బల మసురనాయకుల్ కాంక్ష సేయు
వెలలఁ గట్టి తిమ్మరుసయ్య విలుచుకొనియె. 20

తుళువ కబ్బిలి మొరసు కాతులను బిల్చి
హస్తితురగపదాతుల నప్పగించి
తగినతర్ఫీదు లొసఁగువిధంబు దెలిపి
వాండ్ర నొనరించెఁ గైజీతగాండ్రు కాఁగ. 21

వేయువేయుగఁ బిలిపించి తిమ్మరుసు సై
న్యపతులతోడ మంతనము లాడు
నటు పారశీకుల నిటు పోర్చుగీసుల
వ్యాపార మాశ్వికబలము పెంచె
దుష్టశక్తుల నెల్లఁ దొలఁగించి స్వామిభ
క్తులఁ బ్రీతి దుర్గనాథులుగఁ జేసెఁ
బాశ్చాత్యయవనుల పద్ధతిన్ సైన్యాల
తరిఫీదు సేయించెఁ దగిన దంచు

దక్షిణావని రేఁగుతంత్రంబు లరసె
గజపతుల దురాక్రమణంబు గంగరాజు
మదము తురకలప్రాబల్య మెదఁ దలంచి
సర్వసేనాని నల్లన సంప్రతించె. 22

అది రహస్యసమావేశ మందు మంత్రి
వరులు స్వామిభక్తులు సైన్యపతులు గొల్వ
రాయ లుచితాసనాసీనుఁ డాయె, మంత్రి
తిమ్మరుసు పల్కె సభ నెల్లఁ దేటి చూచి. 23

అణఁగి రేఁగుక్షుద్రోపద్రవాత్ము లైన
శబరకర్ణాటకవనసంచారు లైన
పాళెగాండ్రను బంధించి ప్రబలుఁ డగుచుఁ
దెచ్చె నిదె దేవ! చౌడప్పధీరుఁ డనఁగ. 24

బలవదరాతిశీర్షముల భండనమందు విలాస మొప్పఁ బూ
వులవలె వీరు లై విఱిచి పూజ్యత నందుచు నొక్కమాటయుం
బలుకరు గర్వముం గనరు ప్రౌఢిమ చూప ర దెంతవారలో
కలిమిబలంబులన్ జెడనిజ్ఞానులు చౌడప భద్రు లారయన్. 25

తోఁణకనిస్వామిభక్తి నటధూర్జటిశౌర్యరసంబు రక్తపుం
గణముల నింకుమిమ్మఁ గనఁ గన్నులపండువు లయ్యె మీబలం
బున సరిహద్దులం బెనఁగుమూర్ఖులమూలబలంబు లన్నియున్
దునిఁగె బిజాపురోన్మదుల తొందర లింక నదృశ్య మయ్యెడిన్

మనకు బిజాపుర ప్రజకు మధ్య వెలింగెడుచంద్రగు_త్తికిఁ
ఘనుఁ డగుభద్రపాగ్రజుఁడు గౌరవనీయుఁడు చౌడపేంద్రుఁడే
జనులకు నాయకుం డగుచు శాంతిసుఖంబుల నెల్లవేళ మా
మనసులఁ బొంగఁ గాచు నని మానవనాథుఁడు స్నేహమూ_ర్తి యై.

పల్లకియు ఛత్రచామరప్రతతి మఱియు
ఖడ్గరాజంబు నర్పించి కొన్క గాఁగ
యవనరాజుల నొకకంట నరసికొనుచుఁ
జంద్రగు_త్తిని నేలు మో చౌడపార్య! 28

రామలక్ష్మణులవలె నో రమ్యమూర్తు
లార! మీవంటి సాహసోదారులౌ ప్ర
తాపవంతులే సామ్రాజ్యధర్మశ_క్తి
కరయఁ బెట్టనికోట లై వరలఁ గలరు. 29

అనుచు శ్రీకృష్ణరాజేంద్రుఁ డంత నేఁటి
నుండి చౌడప్ప నాయకాఖ్యుం డటంచు
జగతి మిము నెల్ల భంగుల సత్కరింప
సకలసామంతనృపులకుఁ జాటువాఁడ. 30

అనఁ జౌడపార్యుఁ డల్లనఁ
దన పీఠమునుండి లేచి తమ వాత్సల్యం
బున మాపై నిడుభారం
బును దీర్తుము దేవ! ప్రాణములు కలవఱకున్. 31

మేటిపరాక్రమనిధి యిట
సాటి యెవం డీతని కని చౌడపనాయున్
నాఁటిసభ ప్రశంసింపఁగఁ
బాటించి సభాక్రమంబుఁ బలికె సచివుఁడున్. 32

కృష్ణరాయక్షితీశా! ధరిత్రి నెల్ల
వేయికనులఁ బరీక్షింప వివిధగతులఁ
బ్రజ సకలశాంతి సుఖముల బ్రతుకుచుండె
రామరాజ్యమే యంచుఁ దాఁ బ్రమద మందె. 33

ముప్పదిలక్షలౌ ప్రజలు మోదముతో నగరంబునం బ్రభూ!
నిప్పుల దూకు మన్నను గణింపక ప్రాణము లైన ముందుకున్
దెప్పర మంద దూకెదరు దేవర పైఁ గలభక్తి యెట్టిదో?
చెప్పఁగ లేము మీ ప్రజల చిత్తములం గలదేశభక్తియున్. 34

మనవారి కీర్తుల మల్లెమొగ్గలఁ జేరి
పాశ్చాత్యదేశాలు పరిమళించె
మనవారి రసికతామాధుర్యమే రవ
సెల్లాలతోఁ బరస్త్రీలఁ దేల్చె
మనవారి సహనసద్గుణసంస్కృతులె యన్య
దేశమతముల కాతిథ్య మొసఁగె
మనవారి శక్తిసామర్థ్య మన్యజగాల
సాగరత్రయముతోఁ జాటుచుండె

మతముపేర హిందూముసల్మానుల కిటఁ
గలహ మన్నది మచ్చున కైన లేదు
మానుషత్వ మమర్త్యత్వ మై చెలంగ
మలసె నాల్గుచెఱంగుల మన ప్రతిష్ఠ. 35

కొండపల్లి మాఁదేర! యా కొండవీడు
మనదె కా దని వాదుకు మళ్ళిన మఱి
యాకటకముదాఁక మనదే రా యటంచుఁ
జాకిరేవున ధ్వనియించె జనులవాక్కు. 36

శౌర్యోత్సాహము పొంగి పొర్లఁగఁ బ్రజాసందోహ మశ్రాంతముం
గార్యోద్యోగము దిక్కు లెల్ల దిగ్రమింగంజూచుఫాలాక్షునేన్
ధైర్యస్థైర్యముల న్నెదుర్కొనుచు నీ తత్త్వంబునం భక్తితా
త్పర్యార్థప్రతిపాదితప్రవరులై ప్రాణంబు లర్పింతురన్. 37

భవదాజ్ఞావశవర్తులై మనభటవ్రాతంబు పాశ్చాత్యసై
న్యవిధానం బరిగించుకోఁ గలిగె సైన్యాధ్యక్షు లత్యంతపా
టవసంగ్రామకళావిశారదులు నీటం జాడలం దీయుశ
త్రువినిర్మూలనకార్యదక్షులు ప్రభుత్వోద్యోగదీక్షాపరుల్. 38

తురకల గుఱ్ఱపుందళ మెదుర్కొన నేర్చుతురంగవర్గమున్
బెరిగెను వీరభద్రనృపవీరుని మేటిమదేభపంక్తికిన్
సరి యగు భద్రజాతిగజసైన్య మపారభటప్రపంచ మీ
ధర తలక్రిందు సేయఁ దమధాటి జగద్విదితంబు కావలెన్. 39

అనినంతనె సభలోఁ జే
రినవారలు చకితు లైరి పృథ్వీస్థలిలోఁ
గన విద్యాప్రజ్ఞాబలగుణ
మని తిమ్మరుసయ్య చేఁత లాత్మలఁ దలఁపన్. 40

అల్ప మగు కాలమున నె యనల్ప మైన
సైన్యములఁ గూర్చినప్పాజిశక్తి కయ్య
మరసు నిర్విణ్ణుఁ డై రాజు నరసి పలికె
దేవ! ధన్యుండ వప్పాజిసేవ లంద. 41

బల మడఁగియు సామంతులు బాధపడరు
తప్పు సూపిన మంత్రినే దైవ మనిరి
రాజ! రాజకార్యంబు ధర్మానురక్తి
ప్రతిఫలించినమూర్తి యప్పాజి యరయ. 42

లలితలావణ్యలక్ష్మీవిలాసవతులు
రమ్య మై వెల్గునవరత్నరాసు లమరె
కాని స్వామి కీయన్నింటికంటె మించు
పురుషరత్న మానవప్పాజి దొరకె మీకు. 43

నూటి కొకశూరుఁ డుదయించు మేటి గాఁగ
వేయిటికి నొక్క విబుధుండు వెలయుఁగలఁడు
లక్ష కొకఁడు కల్గును వాగ్విలాసుఁ డగుచు
భూమి కంతయు నొకదాత పుట్టు నేమొ! 44

కోట్లకొలఁది బలఁగ మున్న గుణము గలదె?
పురుషరత్న మొకం డున్నఁ బుణ్య మబ్బుఁ
దళుకుబెళుకు లోహంబులు తట్టెఁ డున్న
వన్నె కెక్కునే యొక టైనఁ బసిఁడివోలె. 45

అఘటనఘటనాసామర్థ్య మంతు లేని
ప్రజ్ఞ తలఁచినంతనె యెట్టిపనుల నైన
గడియలోఁ దీర్చి దిద్దెడిఘనులు కలుగఁ
జక్రవర్తి కసాధ్యంబు జగతిఁ గలదె? 46

అనునాయయ్యమరసు చ
క్కనివాక్యము లాలకించి కార్యపుఁదెఱఁగుల్
వినిపించుతిమ్మరుసునె
మ్మనముల్ సభ నెఱిఁగి పలికె మనుజేశుండుల్. 47

మనుజమాత్రుండె యప్పాజిమంత్రివరుఁడు
ఆర్ష రాజ్యసంస్థాపకుం డరసి చూడ
జన్మజన్మాల కేనియు సడలఁ బోని
ఋణము పడి యుండె నితని కీ మనుజజాతి. 48

నగరి సంరక్షణార్థ మై నడుము గట్టి
నిలువఁ గలసైన్యశక్తులు నేఁడు గూడె
గుండెలో నాటుకొని యున్నకొఱ్ఱు దీసి
తిమ్మరుసు రాజ్యలక్ష్మికి దిట వొనర్చె. 49

తాళి చొకట్లు కుళ్ళాయి తగుకబాయి
మీఱువలువలు మేలికస్తూరితోడ
వక్కలాకులు పెట్టి సత్తాంగ మొసఁగి
మంత్రివర్యుని మన్నించె మనుజవరుఁడు. 50

సభ్యు లెల్లరు నుతియింపఁ జక్రవర్తి
సాటి లేనిమర్యాదల సత్కరింప
మంత్రి గర్వ మందక లేశమాత్ర మేని
భావికార్యక్రమ మెఱింగి పలికె నచట. 51

కంచిలోఁ దల యెత్తెఁ గలఁతలు సాంబువ
రాయండు రాచమార్గంబు దప్పెఁ
గర్ణాటరాజ్యాన గంగరాజుకుఁ గనుల్
తల కెక్కె రాయబారుల నడంచె
మళయాళకూర్గుమండలిపాండ్యచోళచే
రప్రాంతము తమ దర్శనము గోరె
నశ్వపతులఁ గొంత నదిమి యాపై గజ
పతిమూకలను సుంత పట్ట వలయు
నన్యదేశీయు లావారి యాంతరంగి
కప్రవర్తన మెట్టిదో కాంచ వలయు
స్నేహసౌహార్దవృత్తి వాంఛించి దక్షి
ణాపథం బొక్కత్రాటిపై నడప వలయు. 52

రాయలు మంత్రులం గని పరాక్రమవంతులఁ జూచి మీయభిప్రాయము లెట్టివో ప్రజలు రాజ్యము కార్యపుఁదీరు నూతనాధ్యాయములోని యభ్యుదయతత్త్వము నాత్మబలాబలంబులన్ ధ్యేయ మెఱింగి పల్కుఁ డని తెల్పఁగ నాసభలోని వారలున్.

రగులుకొనుచున్న నిప్పులు రాజ్యరమను
గొంప దీయును మనము వీక్షింపకున్న
సాగుసామంతనృపుల స్వేచ్ఛాప్రవృత్తిఁ
బట్టి నలఁపుటే మే లనె బాచమరసు. 54

రాజ్యవిస్తృతియే స్వధర్మం బటంచు
రాయసము తిమ్మరుసు పల్కె రాజ్యలక్ష్మి
కొలుచువీరవర్యుల ననెఁ గొండమరసు
ఆలసింపఁగ రా దనె నయ్యమరసు. 55

మున్నీటితరఁగ లై ముప్పదివేలు నా
సైన్య మన్యుల ముంచు స్వామి! యంచుఁ
గామనాయకుఁ డతిగంభీరుఁ డై పల్కఁ
దిరుమలనాయుండు తిన్నఁగాను
నేఁబదివేలు నిదే! ప్రభూ! సింగంపుఁ
గొదమ లై శత్రులఁ గూల్తు రనఁగ
గాలాగ్నిరుద్రుని కనులలోఁ బడు మన్నుఁ
గను మూసి లంఘింపఁ గలుగు స్వామి

భక్తు లిరువదివేలు నావైపు గలరు
ప్రాణ మేనియు నిత్తు మీపాదముల క
టంచుఁ బలుకఁ దిమ్మానాయుఁ డచటఁ జేరు.
స్వామిభక్తు లత్యద్భుతస్వాంతు లైరి. 56

మేనిలోఁ బ్రాణముల్ మెదలెడిదాఁక మీ
మ్మనుసరింతు ననెఁ గృష్ణప్పనాయుఁ
డరులకంఠంబులఁ విరులరీతి విదిల్చి
కాన్క లిత్తు ననె వెంకప్పనాయుఁ
డీరాజ్యలక్ష్మికై యేమి సేయుట కైనఁ
బ్రథముఁడ నే ననె రాఘవుండు
బాహుబలప్రతాపాగ్ని నరాతిసై
న్యాటవుల దహింతు నంచు తీవి
కులుక నాగమనాయుండు పలికెఁ గాని
సర్వసైన్యాధిపతి పెమ్మసానివంశ
వారినిధిచంద్రుఁ డతులదుర్వారబలుఁడు
మౌనముద్రితుఁ డౌట తిమ్మరుసు చూచి. 57

రామలింగనాయక ! భవత్స్వామిభక్తి
యతులితోద్వేగ మాస్వామతానురక్తి
బాహుశక్తియె రాజ్యసౌభాగ్యలక్ష్మి
మనబలము మీతలఁపుల మర్మంబు లేమొ ! 58

సైన్యం బెటు నడపింతువో!
యన్యుల హాత మార్చు టెటులో! యాంధ్రుల దౌప్ర
పీణ్యం బెటు సూపెదో! రా
జన్యుని మెప్పించు టెటులో! సైన్యపతీ! నాఁ 59

వ్యాయామార్జితశక్తిసారము వయఃప్రౌఢత్వపుంగాంతులుఁ
ఛాయావల్లరు లొచు నేత్రములలో స్పష్టంబు లై సాగినఁ
రాయల్ పల్కినపల్కు తిమ్మరుసు కార్యారంభ వాక్యంబులఁ
న్యాయం బెల్ల నెఱింగి పల్కినట సైన్యాధ్యక్షుఁ డుద్వేగి యై.

మెలికలు దీరుచంద్రకళ మీసముగాఁ శరదిందుచంద్రికా
కళలు కటాక్షవీక్షలను గాల్వలు గట్టఁగ దివ్య మాముఖో
జ్జ్వల మగుకాంతి మా తెనుఁగువారి యుగాల తపంబు పండఁగా
వెలుఁగులఁ జిందె నంచు నిను వేడుకఁ గొల్చెదఁ గృష్ణరాణ్ణృపా!

ఎదుటఁ బడి నోట వచ్చిన ట్లెల్ల ముందు
వెనుక లరయక యీసభఁ బ్రేలి పెట్టి
మొట్టిగాథల విన్పించుమూర్ఖుఁడ నని
ప్రభువు లాత్మఁ దలఁప రంచుఁ బలుకువాఁడ. 62

యుద్ధోన్మాదము రాజ్యతంత్రముల నత్యుత్సాహముఁ గూర్చు స
న్నద్ధుం డౌప్రభువర్యుఁ డెల్లపుడు సైన్యానీకముఁ జేర్చునీ
సిద్ధాంతంబున ఖడ్గదేవతల నాశీర్వాదసౌభాగ్యమే
యుద్దీపం బగు ధర్మశక్తి కను చే నూహింతు నో భూవరా! 63

రణరంగంబునఁ గత్తితోఁ దిరుగుటల్ రాజ్యంబు కాపాడుటల్
మునివృత్తిన్ భయదాటవీచరుల మై ముక్తిస్థితిన్ బొందుటల్,
జనసందోహము తీర్చి దిద్దెడికళాచార్యత్వ మి ట్లన్నియున్
జనితానందపథాంతరంబు లయి నిస్స్వార్థంబు లై తోఁచెడిన్.

పరసైన్యంబుల శక్తిసారము లెదన్ భావింప దుర్భేద్య మా
పరదుర్గంబులఁ గొండపల్లి యన నా ఫాలాక్షుఁడున్ జంకు నిం
క రణప్రౌఢవిహారుఁ డాగజపతిం గష్టంబు సాధింప దు
స్తర మానాతని పాత్రనాయకుల వే స్తంభింపఁగాఁ జేయుటల్.

దురభిప్రాయము పొందఁగాఁ దగదు ముందుం జూచి నాబుద్ధి కి
త్తఱిఁ దట్టం గలభావముల్ నుడివెదన్ తథ్యంబు విద్వేషులం
గరవాలంబుల నమ్మియే నడచినన్ గష్టంబు సాధింపఁ ది
మ్మరసుప్రజ్ఞ ఫలించెనా గెలుపు నమ్మ న్వచ్చు నో భూవరా!

ఇంతకుఁ గృష్ణరాడ్హృదయ మెంతయు ధర్మము రాజనీతి న
త్యంతబలంబు తిమ్మరుసు తంత్రము శౌర్యము ఖడ్గశక్తియున్
వింతగ నిచ్చటం గలిసె వేయివిధంబుల దైవశక్తి కా
ర్యాంతరదీక్షలన్ ఫలము లై శుభ మెల్ల జగంబు నోచెడిన్. 67

అన్యబలము లన్న నంతగా యోచింప
వలవ దాత్మబలము ప్రబల మంద
గడియలోన గెల్తుఁ గర్ణాటరాజ్యంబు
దక్షిణాపథంబు తలఁప నేల. 68

తురకలను బాఱఁ బాఱఁగఁ దఱుమఁ గొట్టి
మూఁడుచెఱువుల నీళ్లు త్రాపుదును బుట్ట
గొడుగు లౌనన్యరాజుల కుతిక లెల్ల
గోట మీపెద మీదయ కూడె నేని. 69

అంకిత మయ్యె నాబ్రతుకు హైందవజాతికి మేనిప్రాణ మిం
దింకెడిదాఁక నాప్రభుని కృష్ణమహీపతి నాంధ్రలక్ష్మి ప్రే
మాంకుర మైనవాని చరణాబ్జములన్ నుతియించి కొల్చెదన్
పంకిల మైనజీవితము వాడునో! పండి ఫలంబు లందునో! 70

ఊరక మాటలన్ బలుక నొప్పునె? కార్యము రాఁగ శౌర్యపున్
సారము చూపుటో బ్రతుకు శౌర్యసముజ్జ్వలకీర్తిచంద్రికా
సారమునందు లీన మయి సౌఖ్యము నొందుటో యేదియో యగున్
ధీరవచఃప్రమాణముల తీరు నెఱుంగరె మంత్రిశేఖరుల్. 71

మెఱుపై ప్రాలెద నిఁకఁ జి
చ్చఱపిడుగుల్ చిటులునటుల సైన్యంబులతోఁ
బెఱవర్గంబుల నిపుడే
పరిమార్చెద నృపునియాజ్ఞ పాలింతు నన్. 72

నాయకగ్రామణీ! మీమనఃప్రవృత్తి
దెలిసె సామ్రాజ్యలక్ష్మికై తెలివె కాదు
కండలను గోసి ప్రభుభక్తి కానుక లిడుచు
నిలిచి కొలిచెడివాఁడ మీవలె నొకండ. 73

బహామనీరాజ్యపాలకవర్గ మనిన
భయము లేదయ్యె నేఁటికీ ప్రభునివలనఁ
బూర్వ మణఁగారు హైందవభూమి సుంత
నాత్మఁ దలఁచిన మనగుండె లావులించు. 74

శిలల నానంద మొలికించి జీవ మొసఁగు
మతము సరిపడ దాయెఁ బో మనసు లేదె?
విశ్వమానవసౌందర్యవిగ్రహములఁ
జూచి యానందముగ్ధు లై సోలుటకును. 75

రాజ్యదాహమే కలిగిన రాజ్య మేలు
ప్రభుల హత మార్చ నీప్సితార్థంబు కూడుఁ
గాని ప్రజలు చేసినపాపకర్మ మేమొ!
తోట్లలో నున్నపాపలదోస మేమొ! 76

ఏయెడ వత్తురో! యెచటి కేగతి నెత్తికి వ్రాలి కత్తుకల్
కోయుదురో తురుష్కు లని క్రుంగుచుఁ బూర్వనృపాలు రే యెదన్
జే యిడి నిద్ర పోవ రిఁకఁ జెప్పఁగ నేల ప్రజాళిఁ గూర్చి నేఁ
డాయమబాధలం దలఁప నంటనిమంటగ మాడ్చదే మమున్.

ప్రళయరుద్రుని నాట్యంబు ప్రజ్వరిల్ల
బుస్సు మని లేచి శివనాగు పొగలఁ జిమ్మె
భస్మరాసుల బసవన్న పట్టరాని
క్రోధ ముప్పొంగఁ గొమ్ములఁ గ్రుమ్మి వైచె. 78

ఉడుకురక్తపుస్నానమ్ము కోర్వ లేక
తల్లిబిడ్డల యెడఁబాటు తాళ లేక
పాడియావుల తెగకోఁత చూడ లేక
కృష్ణవిభుఁ జూచె భూదేవి గెలివి పొంద. 79

హృదయము లేనియాతురక లీగతిఁ బల్లెలఁ బట్టణంబులం
దెదు రనుమాట లేక యిటు లెప్పుడు నాదులశాహికత్తిమా
టోదిగి తురుష్కరాజులు మహోగ్రవిధంబునఁ గొల్ల గొట్టుచున్
మదమునఁ గృష్ణరాయనృపమాళిని దాకిరి వార లెల్లరున్. 80

ప్రబలరాజాధిరాజ వీరప్రతాప
రాజమార్తాండుఁ డౌకృష్ణరాయఖడ్గ
శక్తిచేఁ గూలె నాదులశాహిశిరము
అయిదువర్గాల తురకలు నదిరి పడఁగ. 81

కోఱ లుడిగినపాము లై కొఱఁత వడిరి
మతముపేరిట యుద్ధంబు మానుకొనిరి
బ్రతికినతురకదొర లెల్ల రాయ లంతఁ
దండ్రి చచ్చినసుతుని సుల్తానుఁ జేసె. 82

బహామనీరాజ్యపాలకవర్గమునకు
మనకు నాఁడె మైత్రి కుదిరె మనవిభుండు
యవనరాజ్యసంస్థాపకుం డయ్యె, నిచట
యుద్ధ మిఁక యుక్తమా యని యూహ సేతు. 83

తురకల నమ్మఁగాఁ దగదు దోర్భవశక్తి నెఱింగి యెప్పుడో
నఱకెఁ దదన్యజాతుల మనంబున మార్దవ మన్న మాటయే
యెఱుఁగరు వారి నమ్మి యొకఁ డేనియు సౌఖ్యము లందఁ డింత దాఁ
కరయఁగఁ బాలఁ బెంచిన విషాగ్నులు తగ్గునె సర్పజాతికిన్. 84

ఐనను ధర్మముం దెలిసి యాంతరవృత్తి నెఱింగి హైందవో
ద్యానగుణప్రసూనములఁ దాల్చి శిరంబులఁ గార్యఘట్టముల్
పూనికతో సడల్చుటయె పుణ్యము పూచి ఫలించు లేనిచో
మానవజాతిలో మనకు మాయనిమచ్చ యగున్ మహాప్రభూ!

నేఁటికి సుల్తాను మాటలు చాలించి
యొకకంట వీక్షించుచుంట మేలు
తొలుదొల్త దక్షిణాస్థలిఁ గలరాజ్యముల్
తఱచి శోధించుట తగిన దేమొ!
దానిపైఁ గర్ణాటధాత్రిలోఁ జెలరేఁగు
కలఁతల నణఁచుట సులభ మగును
అటుపైన సమయంబు నరసి గజపతుల
యుక్తితో వంచుట యుక్త మనుచుఁ

దిమ్మరుసుమంత్రి ధీరుఁడై తెలియఁ బలుక
సభ్యు లెల్లరుఁ దగు నంచుఁ జాటి రపుడు
కాని కృష్ణరాయల మనోగతుల నిశ్చి
తార్థ మెట్టులో యని వార లరయువేళ. 86

మందమనోజ్ఞహాసముఖమండల మల్లన నెత్తి రాయ లా
నందముతోడఁ బల్కె జననాయకులార! భవన్మనఃపథం
బందలి భావముల్ తెలియ నాజిఁ దిరం బగుసైన్యనాథుఁ డె
న్నందగు రామలింగనృపనాయకుఁ డాడినమాట లెస్స యా. 87

పండువెన్నెల లానందపథమె కాక
మండుటెండగఁ గరఁగించి మాడ్చఁ గలదు
అమృతసూతి కీద్వంద్వంబు లంట కెపుడు
నెఱపువిధ్యుక్తధర్మముల్ విరియునటుల. 88

బలముఁ జేవయుఁ గలిగిన ఫలము కలదె?
నాయకుం డన్నరీతి యనంతశక్తి
దైవశక్తి యొకింతయుఁ దగుల కున్న
నడవి విరిసినపూవు లై యణఁగి పోవు. 89

దైవశక్తితో మనుజయత్నంబు గలియ
గాత్రమాధుర్యముం గలగానశక్తి
విమలవీణానినాద మై విరియునటుల
నమృత మొలికించి జగతికే హాయిఁ గూర్చు. 90

పరిమళంబు కాంతి పత్రసౌందర్యము
కడుపులోనఁ దీపి కదలుచుండఁ
బూలు బురఁదగుంటఁ బుట్టవే స్వార్థంబె
శాశ్వతత్వమునకు జన్మభూమి. 91

స్వార్థరహిత మైనజన్మంబు దివ్యంబు
స్వార్థసహిత మైనజాతిరక్తి
తమక కాదు మనుజతత్త్వంబులో నున్న
మధురమార్దవముల మనసుఁ దెలుపు. 92

ఎదిరి నెఱుఁగనిస్వార్థంబు హీన మగును
జగతి కానందభంగ మై జనుల మాడ్చు
సర్వనాశనం బగురాక్షసస్వరూప
మది నృపాలుఁ డపేక్షించు టంత్యమునకె. 93

స్వార్థరహితుఁ డౌనృపుఁడు జీవచ్ఛవంబు
కాని ప్రభుని స్వార్థంబు జగచ్ఛుభోద
యంబు ధర్మసంస్థాపనార్థంబు గాఁగ
మానుషత్వ మమృతమయం బై చెలంగు. 94

మనుజదృక్పథంబులఁ బట్టి మాఱుచున్న
మంచిచెడుగులు కార్యాంతమందుఁ దేలుఁ
గురియఁబోమెడివర్షంబు గుర్తు గొనక
నల్లమబ్బులఁ గసరుట న్యాయ మగునె? 95

స్వార్థమో లేక విశ్వసౌజన్యగుణమొ!
వ్యసనమో! జగత్కల్యాణవైభవంబొ!
అంధకారమో! సాంద్రచంద్రాతపంబొ!
స్పష్ట మగుఁ గాదె కార్యావసానమందు. 96

నగరసంరక్షణార్థమై నడుము గట్టి
నిలువఁ గలసైన్యశక్తులు నేఁడు కూడె
గుండెలో నాటుకొని యున్నకొఱ్ఱుఁ దీసి
తిమ్మరుసు రాజ్యలక్ష్మికి దిట వొనర్చె. 97

చూపుల శత్రుల సోలించుదేవుఁ డౌ
నప్పాజిధీయు క్తి యండ గలదు
ముక్కోటిదేవతల్ మురుకొన్నను గోట
కాపాడుకై జీతగాంద్రు గలరు
సింగంబు లై శత్రుసేనలఁ జీల్చెడి
యమరనాయకబలం బతిశయించె
మారి మసఁగురీతి మననాయకుం డొక్కఁ
డొక్కఁడే పరబలం బూడ్చఁ గలఁడు

ధర్మలక్ష్యంబు శాంతిదాత్యంబు గలదు
ఋషుల సంస్కారశక్తి జ్వలింపఁ గలదు
ఏడుకొండలదేవుఁడే యేడుగడయు
నడవుఁ డిఁక యుద్ధభూమికి నడుము గట్టి. 98

చైత్రయాత్రాముహూర్తనిశ్చయము నేఁడు
జరుపఁబడుఁ గాక దక్షిణాశాపథాన
విజయనగరసామ్రాజ్యపు విజయభేరి
వినఁబడును గాక కలఁతలు విఱుగుఁ గాక. 99

అని సభ చాలించిన వి
చ్చినసైన్యాధీశులు తమచిత్తంబుల వీ
రనికాయంబుల నిలిపి ప
దనుకత్తుల నూఱి రంతఁ దళతళ మనఁగాఁ. 100

ఇది చతుర్థాశ్వాసము.

---

శత్రుసేనల దహియించుహోత్రశక్తి
ప్రజ్వలింపఁగ రాయలు ప్రతినఁ బట్టెఁ
బొంగుపొంగులై యావీణఁ బొరలి పడఁగ
రౌద్రరసము ‘హంసధ్వని’ రాగ మయ్యె.

# హంసధ్వని

దక్షిణాపథ మెల్లఁ దనయాజ్ఞ దలఁ దాల్చె
నాంధ్రనాయకరాజు లాదుకొనఁగ
గంగరాజును ద్రుంగి కావేరి కృష్ణరా
యల జయాంకితగీతి నలలఁ బాడెఁ
జిక్కరాయలు గొల్వ శివసముద్రాది ఉ
మ్మత్తూరుకోటల మాట నిలిచెఁ
గాటూరుపతిశక్తి కాల్వాలం బడి పోవ
బంధించె నార్కాడు పట్టణమున
విజయలక్ష్మితో రాయలు వీరభటులు
విజయనగరంబునకుఁ జేర విజయభేరి
రోదసీగహ్వరం బెల్ల మ్రోయుచుండ
స్వాగతంబుల నొసఁగె నా పౌరకోటి. 1

"హిందూరాజ్యరమాధురంధరభుజాహిగ్రామణీకంచుక
త్కుందస్వచ్ఛయశోగుళుచ్ఛ! యవనక్షోణీధవస్థాపనా
మందీభూతకృపాకటాక్ష! యసకృన్మాద్యత్కళింగాంగనా
బందీగ్రాహవిగాహితోత్తరకకుబ్ధాటీసమాటీకనా.' 2

అనుచుఁ బెద్దనామాత్యుండు హస్త మెత్తి
యవనినాథున కాశీస్సు లందఁ జేయ
ముసిముసి నగవు మొగంబున ముసరుకొనఁగఁ
దిమ్మన వచించెఁ గృష్ణక్షితీశు నరసి. 3

'రాయగ్రామణి కృష్ణరాయ! భవదుగ్రక్రూరఖడ్గాహిచేఁ
గాయం బూడ్చి కళింగదేశనృపతుల్ కానిర్ఝరీపోషణీ
మాయాభీ కుముటూరులోటు కుహుటూమాయాసటాజాహరే
మాయాగ్నేయమడే యటంద్రు దివి రంభాజారునిన్ యక్షునిన్.

విజయలక్ష్మీవిభుం డైనవిభునిఁ జేరి
పెద్దనాది సకలసత్కవీంద్రు లచట
యుక్త మగునట్టు లాశీస్సు లొసఁగి రంత
సాదరోదారమూర్తి యాచక్రవర్తి. 5

వివిధభంగిమముల విహరింప శారద
వివిధవిధులు కళలు విస్తరిల్లె
వివిధకళలరూపు వేర్వేఱుగాఁ గవు
లార! మీముఖంబులందుఁ దోఁచె. 6

అని యాహ్వానించుచుఁ గృ
ష్ణనృపాలుం డుజ్జ్వలభవనంబందు సుఖా
సనముల వారికిఁ జూపుచు
వినయంబున వారి కెల్ల వివరించె నటన్. 7

నులివెచ్చని రక్తపుటే
ఱుల సాహసలక్ష్మి ప్రణయరోచిఁ గటాక్షాం
చలముల యెద లూపుచు విజ
యలక్ష్మి నుయ్యాల లూఁపె నాతురత గొనన్. 8

కత్తులఁ గుత్తుకల్ దఱుగుఘట్టములందుఁ గృపారసంబు రూ
పెత్తుమనోజ్ఞదృశ్యములు హృద్యత గూర్పఁగ మానవత్వమం
దుత్తమదేవతాప్రకృతు లొప్పుట సూచితి మా స్థలంబులం
దత్తఱి నిద్దురన్ గలల హాయిని గూర్చెడిరీతి నెన్నియో. 9

పంచభూతముల్ ముద్దుగాఁ బెంచుకొనిన
యాటవికమానవుల హాయి హాయి గూర్చు
కాయకష్టోపజీవులు కల్లకపట
మెట్టిదో లేశమాత్రంబు నెఱుగఁ బోరు. 10

చెట్టుల గుట్టలం బ్రతుకుజీవుల యచ్చపుస్వామిభక్తియే
కట్టలు గట్టుకొన్నకడుగౌరవమూర్తుల మిత్తి నైన గీ
పెట్టి యెదిర్చి నిల్పఁ గలవీరుల సింగమునేనిఁ జేతితోఁ
బట్టి యదల్చి వంపఁ గలవారలఁ జూచితి మచ్చటచ్చటన్. 11

పిడికిట నాగండశిలలఁ
బొడిపొడి నొనరించువజ్రమూర్తుల యెదలం
దడవిన నెద వెన్నెల లగుఁ
గడు మెత్తందనము చూడఁగాఁ బాల్ దొనఁకున్. 12

కొఱవిదయ్యంబులం జెఱలాడుసమయానఁ
 జాకిరేవున కేఁగుచాకివాఁడు
కోడి కూయక మున్నె కోడెదూడలతోడఁ
 గపిల కేఁగుచు నున్నకాపుపెద్ద

తొలిప్రొద్దు తెమ్మెర చలిబాధయే లేక
కసవుప్రోగుల కేఁగు కాపుబిడ్డ
మండుటెండలలోనఁ గొండపేటుల నెక్కి
గోమాతలం గాచుగొల్లవాఁడు
కపట మెఱుఁగనికర్మయోగంబునందుఁ
ప్రకృతి కల్లారుబిడ్డలై పాటుపడుచు
విశ్వమానవకోటికి విందు సేయు
సహనసౌభాగ్యమూర్తు లాజానపదులు. 13

పల్లెయే భారతీయుల భాగ్యవల్లి
పల్లెయే భారతాంబకుఁ బట్టుఁగొమ్మ
పల్లెయే దేశమాతకుఁ బ్రాణపదము
పల్లెయే లేక రాజ్యాలు బ్రతుకఁ గలవె? 14

అరుణరాగచ్ఛాయ లస్తాద్రిపైఁ గ్రమ్మ
నాలఁ గాచెడివాని యీలపాట
లాయీఁదుగాలిలో నస్పష్టమై విన
వచ్చుపిల్లనఁగ్రోవి పల్లెపాట
లనతిదూరంబునం దలలతో శ్రుతి గల్పు
జలదేవతలు పాడుసరసగీతి
వెన్నెలగాలులే విన్పించుచున్నయా
కపిలఁ దోలెడివాని గానరక్తి

ప్రకృతిసౌందర్యశక్తులు ప్రతిఫలింపఁ
బరవశం బందువారి యా బ్రతుకు లెల్లఁ
దలఁచినంతనే యొడ లెల్లఁ బులకరించి
స్థిరసుఖానందడోలికఁ దేల్చివైచు. 15

పట్టణవాస్తవ్యుల నా
గట్టిదనము సొగసు మాటగరువము లాయా
పట్టులఁ జూచుచుఁ బోవఁగఁ
జెట్టులు చివురింపఁ గలవు సింగారమునన్. 16

కన్నుల కొదవిన నాలుక
కన్నవి కన్నట్టు చెప్పఁ గల్గుదుము రసో
త్పన్నము లగుదృశ్యంబుల
నెన్నో రణభూమి కేఁగు చెరిగితి మంమన్. 17

అటఁ గళింగదేశ మణఁగార్పఁ జనుచు శ్రీ
కాకుళాంధ్రదేవుఁ గనుఁగొని హరి
వాసరోపవాసమే సల్పి సేవింప
నానిశాచతుర్థయామమందు. 18

*నీలమేఘము డాలు డీలు సేయఁగఁ జాలు
మెఱుఁగుచామనచాయ మేనితోడ
నరవిందముల కచ్చు లడఁగించుజిగిహెచ్చు
నాయతం బగుకన్నుదోయితోడఁ

బులుఁగురాయనిచట్టుపలవన్నె నొఱఁబట్టు
పహొంబట్టుజిలుఁగురెంటంబుతోడ
నుదయార్కబింబంబు నొఱపువిడంబంబు
దొరలంగ నాడుకౌస్తుభముతోడఁ
దమ్మికే లుండఁ బెఱకేల దండ యిచ్చు
లేము లుమిసెడు లేఁజూపు లేమతోడఁ
దొలకు దయ దెల్పుచిఱునవ్వుతోడఁ గలఁద
దంఘ్రిజలజాక్షుఁ డి ట్లని యానతిచ్చె. 19

పలికి తుత్ప్రేక్షోపమలజాతి పెం పెక్క
రసికు లౌ నన మదాలసచరిత్ర
భావధ్వనివ్యంగ్యసేవధి గాఁగఁ జె
ప్పితివి సత్యావధూప్రీణనంబు
శ్రుతిపురాణోపసంహిత లేర్చి కూర్చితి
సకలకథాసారసంగ్రహంబు
శ్రోత్రపుచ్ఛటలు విచ్చుగ రచించితి సూక్తి
నైపుణి జ్ఞానచింతామణికృతి
మఱియు రసమంజరీముఖ్యమధుర కావ్య
రచన మెప్పించుకొంటి గీర్వాణభాష
యాంధ్రభాష యసాధ్యంబె యందు నొక్క
కృతి వినిర్మింపు మిఁకఁ మాకుఁ బ్రియము గాఁగ. 20

ఎన్నినుఁ గూర్తు నన్ను విను మే మును దాల్చినమాల్య మిచ్చిన
ప్పిన్నది రంగమం దయినపెండిలి సెప్పెను మున్ను గొంటి మే
వన్ననదండ యొక్కమగవాఁ డిడ నేను దెలుంగురాయఁడన్
గన్నడరాయ యక్కొదవ గప్పు ప్రియాపరిభుక్తభాక్కథన్. 21

తెలుఁగదేల యన్న దేశంబు తెలుఁగేను
దెలుఁగువల్లభుండఁ దెలుఁగొకండ
యెల్లనృపులు గొలువ నెఱుఁగవే బాసాడి
దేశభాషలందుఁ దెలుఁగు లెస్స. 22

అంకితమో యన నీకల
వేంకటపతి యిష్టమైనవేల్పగుటఁ దదీ
యాంకితము చేయు మొక్కొక
సంకేతము కా కతఁడు రసన్నేఁ గానే. 23

పొత్త మిటు సేయ నీ కుత్తరోత్తరాభి
వృద్ధి యని పోవ మేల్కని నెఱఁగుతోడి
భక్తిఁ దద్గృహాగోపురప్రణతిఁ జేసి
వేఁగుటయుఁ గల్యకరణీయవిధులు దీర్చి'. 24

వేదవేదాంగవిదులైనవిప్రవరుల
భక్తిఁ బిలిపించి చేయెత్తి ప్రణతిఁ జేసి
స్వప్నముం దెల్ప వారలా ఫలము తెఱిఁగి
దైవవాక్య మవశ్యకర్తవ్య మనుచు. 25

స్వప్నంబునన్ స్వామి సాక్షాత్కరించె, ని
తోధికభక్తి మీ కొప్పుఁ గలదు.
గ్రంథంబు రచియింపఁ గమలాక్షుఁడే తెల్పె
సారస్వతజ్ఞానసార ముబుక
నా దేవు దేవీసమాగమంబె యితోధి
కాఖండభాండభాగ్యంబు లొసఁగు.
నా దేవిచేతిలో నలరుశతచ్ఛదం
బే కాతపత్ర మై యెసఁగఁ గలదు.
నతఁడ శేషనృపుల సేవ లందుకతన
నృపులు గొల్వఁ దత్తద్భాష లెఱిఁగె దీవు.
ప్రేయసీభోగ శేష మే ప్రీతి గనుక
రాజ! బహువిధప్రేయసీప్రాప్తి మీకు. 26

అని వచియింపఁగ దైవా
జ్ఞను దలఁ దాల్చి రచియింపఁ గడఁగితి గ్రంథం
బును నా యోపినగతి మిం
చినభక్తి దొలంక విష్ణుచిత్తీయంబున్. 27

విశ్వరూపంబుఁ దెలియఁగ వేధ నగుచు
విశ్వకల్యాణ మొనఁగూర్ప విష్ణు నగుచుఁ
బూర్ణ మానందమున శివమూర్తి నగుచుఁ
గావ్యజగతిలోఁ దిరిగెడిజ్ఞానిఁ గాను. 28

పూర్వులఁ దిరస్కరింపుచు
గర్వంబున మి మ్మెదిర్చి కవి నై నేనే
సర్వజ్ఞుం డని వీఁగుచుఁ
బర్వులతోఁ గలముఁ బట్ట భావింప నిటన్. 29

ఒకని మెప్పింప వ్రాసెడియూహ లేదు
ఆత్మలో భక్తిభావంబు లవఘళించి
బాధ పెట్టెడివేళనే పాడుకొందు
నింతియే కాని వే ఱొక్క టెఱుఁగఁ బోను. 30

అన నృపుండు ద్రావిడాంధ్రకర్ణాటసం
స్కృతకవీంద్రు లెల్లఁ గృష్ణరాయ!
దైవబలమె కాక దానిపై సకలభా
షాస్వరూప మెఱుఁగుశక్తి మీది. 31

లోకజ్ఞానంబును బర
లోకపు లక్ష్యంబును రసలోలత్వంబున్
మీకై వసమయ్యెఁ బ్రభూ!
మీకావ్యము సిద్ధిఁ బొందు మే ల్మె లనఁగాన్. 32

రూపించినవినయంబును
బ్రాపించినభక్తిభావప్రణయార్ద్రిఝరుల్
వ్యాపించెడికీర్తిలతలు
స్థాపించెడిదివ్యశక్తి తమదే యనుచున్. 33

కవివరేణ్యు లంతఁ గానుక లిచ్చి కైకొని
సెలవు గొనుచు నిండ్లు సేరుకొనఁగ
రాజసభకుఁ గృష్ణరాయ లేతెంచి సా
మంతనృపులఁ జూచె మంత్రితోడ. 34

శాస్త్రసంస్కారశక్తి ప్రశస్తమైన
శస్త్రశక్తియుఁ గలిగి కష్టంబులందు
నమ్మఁదగువార లనుభవజ్ఞాను లైన
బ్రాహ్మణుల దుర్గపతులుగాఁ బంప వలయు. 35

కత్తి చేఁ బట్టఁ గల్గియు గర్వపడరు
ఐహికోపభోగంబుల కంటుకొనరు
పదవి కోరరు నడపించు ప్రాజ్ఞు లగుట
బ్రాహ్మణుల దుర్గపతులుగాఁ బంప వలయు. 36

అని తలంచి యప్పాజిమేనల్లుఁ డౌచు
స్వామిభక్తుఁ డౌనాదెండ్లవారి ఘనత
మలఁచి విధి దీర్చ్చ గోపయామాత్యు నెఱిఁగి
నృపతి కొండవీటిని గాచు నీతఁ డంచు.

తమఖడ్గంబున రాజ్యముల్ నిలుపుమేధాశక్తిసంపత్తులున్
దమధీశక్తిని శత్రులం దునుము నుద్యత్ఖడ్గ తేజంబు ను
త్తమసారస్వతసేవలున్ గలుగు నో ధన్యాత్మ! మీ మేనమా
మ మతిన్ గెల్చినదుర్గమున్ నిలుప సంరక్షింపఁగాఁ బొండనెన్.

కొండమరసు నంత గుర్తించి నృపుఁడు మీ
మంత్రతంత్రవిధుల మహిమలఁ బెను
గొండ చక్కఁబడియెఁ గ్రొత్త దానుదయాద్రిఁ
గావ నేఁడు మీరె కదలుఁ డనఁగ. 39

స్వాధీనం బగుదక్షిణావనిని విశ్వాసార్హులై స్వామిసే
వాధీనాంతరచిత్తవృత్తు లయి రాజ్యాంగక్రియాదక్షులై
యోధాగ్రేసరులైన నాయకుల మాయోపాయమర్మజ్ఞులన్
స్వాధీనం బొనరింప మంత్రి నృపభావం బంటి యోచింపఁగన్. 40

సర్వతంత్రస్వతంత్రుఁడై జన్మతోడ
రాచపుట్టుక కాంక్షించు రాజ్యమేల
వారి కధికారపదవులఁ బంచు టన్న
ననలశక్తితోఁ గలసినయనిల మగుచె. 41

కాని సామంతప్రభువుల గౌరవించి
స్వామిభక్తిని రేపంగఁ బదవు లొసఁగి
వారి నొకకంట వీక్షింప వలయు నంచుఁ
గృష్ణభూపతి యాత్మ నొక్కింత దలఁచె. 42

పెదవి తొలిసంజె వెలుఁగుల వెలుఁగు దిద్ద
నందివర్ధనసుమములు నవ్వుకొనియె
హాయిఁ గూర్చె రాజీవనేత్రాంచలముల
నాత్మగత మైనప్రభుని స్నేహామృతంబు. 43

కండలు గోసి రక్తమును గాల్వలు గాఁగ స్రవింపఁ జేసి యు
ద్దండపటుప్రతాపపువితానము చూపుభటప్రపంచ మా
ఖండలతుల్యుఁ డౌ నృపుని కాన్కలు గౌరవ మాపదంబులన్
నిండుసభాస్థలిం గొనియె నింగికి నెక్కుప్రమోద ముబ్బఁగన్. 44

స్వామిభక్తిని దేశసౌభాగ్యలక్ష్మి
రక్తధారల సకలసామ్రాజ్యశక్తి
దీప్త మయ్యె దేశంబున దిగులు తగ్గె
మీబలమె ప్రజాశాంతికి మేలికోట. 45

నాయకులార! భూమికి వినాయకులై నవిరోధివర్గమున్
మాయముఁ జేసి మాయెడల మన్నన సూపి సమస్తరాజ్య మా
ప్యాయత నోచుస్వార్థరహితాంతరవృత్తికి స్వామిభక్తికై
యీయెడ మే మొసంగునది యేమియు లేదు మనస్సు నెంచుఁడీ.

రాజ్యం బెల్లను మీరలే గెలిచి స్వార్థత్యాగులై మమ్ము సా
మ్రాజ్యాధీశు నొనర్చి గౌరవములన్ మన్నించి సేవింపఁగా
రాజ్యాంగవ్యవహారదక్షులు మతిప్రజ్ఞావిమర్శాత్మకుల్
పూజ్యుల్ మంత్రులుమంత్రతంత్రములతోఁ బోషింతుమశ్రాంతమున్.

సరిహద్దులు సామ్రాట్టుల
శరభంబులు నమ్మఁ దగదు శత్రురహస్యాం
తరవర్తనులకు నెలవై
నిరతంబును బాధ లిడుచు నిప్పులు చెఱఁగున్. 48

వేయికన్నులఁ గనిపెట్టి వివిధగతులఁ
బ్రజలభావంబులంబట్టి పద నెఱింగి
నడచుకొనుస్వామిభక్తు లనన్యశౌర్య
తేజు లిట్టికార్యంబులఁ దీర్పఁ గలరు. 49

నెల్లూరు కొల్లడంబుల
నెల్లలుగా మాకు బదులు కృష్ణప్ప యిటన్
కొల్లడము తంజనగరము
నెల్లలుగా రాఘవుండు నిఁక నేలఁ దగున్. 50

తంజనగరపు దక్షిణధాత్రి కెల్ల
నాయకుం డగు వెంకప్పనాయకుండు
మాకుఁ బ్రీతి నీ విజయప్ప మన్నన గొని
పాలనము సేయు వేలూరుపట్టణంబు. 51

వీరప కెంపేగౌడుల
పౌరుష మీచిక్కనృపతి ప్రజ్ఞయు నుమ్మ
త్తూ రచటి శివసముద్రము
శ్రీరంగము నిలుపుఁ గాక చిత్తం బలరన్. 52

అని కృష్ణరాయలు వచిం
చిన నాసభలోనివా రశేషోదారం
బనుపమసౌహార్దం బని
వినుతించిరి నాయకతతి విభ్రమ మందన్. 53

కత్తులు దీసి కేల నిడి గౌరవ మొప్ప నమస్కరించి రే
కెత్తినభక్తి జెప్పుతుదిఁ గీలిత మైనముదశ్రుబిందువుల్
ముత్తెము లై వెలుంగఁగఁ బ్రభూ! తమయాజ్ఞల మోయువారికీ
మెత్తనిశిక్ష లిట్లొసఁగ మీయెడఁబాటున కోర్వ వచ్చునే. 54

జీవితముల్ త్వదీయపదసేవలఁ బూచి ఫలింప నెన్ని యో
భావము లల్లుకొంటిమి నృపాలుని సన్నిధి వెల్ల మాతృసే
వావిభవంబుకన్న దెగినస్వర్గపదం బది యేటికో ప్రభూ!
పూవులఁ గూడి దారములు పూజ్యత నందుచు నెత్తి కెక్కవే. 55

సాగరవీచికాతటుల సారములందు మనోజ్ఞ మౌపువుం
దీగలలోని సౌరభము దివ్యము లంచుఁ జలింపఁ జేసినన్
రాగము లల్లునో పరిమళంబులఁ జిందునొ! తేనె లూరునో!
యోగవిహీనతం దఱుగునో! ఫల మేమియు లేక వాడునో! 56

అని యాయేడ్వురు నాయకుల్ నిలిచి నేత్రాంభోజపుష్పాల రా
యనిపాదంబులఁ బూజ సేయఁగఁ బ్రమోదాశ్చర్యపాథోధిలో
మునకల్ వైచె సభాస్థలంబు నృపుఁడున్ మోదాంబుధిం దేలె, మీ
వినయోదారమనఃప్రవృత్తు లిచటన్ విస్పష్ట మై తోఁచెడిన్. 57

కడుపుచుమ్మలఁ దల్లిని గలఁత పెట్టి
యత్తగారింటి కేఁగ దే యాఁడుబిడ్డ
తల్లిబిడ్డల కున్న బాంధవ్య మంత
మాత్రమునఁ దీఱునో లేక మాయ మగునొ! 58

ప్రభుసేవాపరతంత్రులై మనసుతో బాంధవ్యముం గూర్చని
శుభదాత్మాకృతులై నమిమ్ముఁ జనుపన్ శోకించు మాయాత్మ కా
ని భవిష్యద్భరతావనీస్థితిగతుల్ నిల్పంగ మాయార్ష శ
క్తి భయం బందక భాగ్యముల్ గురియఁగా దిగ్దేవతల్ మెచ్చఁగాన్.

విద్యారణ్యుని దివ్యతేజము భవద్విశ్వంబులన్ వెల్గ దో
ర్విద్యాపాటవ మాంధ్రశక్తుల నిరూపింపన్ జగచ్ఛ్రేయమే
యుద్యోగం బని నమ్మి మీరు కడు మాన్యుల్ మీవియోగం బెమా
యుద్యోగంబున గొన్న స్తనీఫలములై యుర్వీస్థలిం బ్రోచెడిన్. 60

రాయల పల్కులం దొనఁగు రాగగుణంబును గార్యదీక్షయున్
నాయకవర్గ మం దెటిఁగి నాలుక ముందుకు రాక భీతితో
నాయెడఁ బల్కకుండిరి సభాంతర మల్లనఁ జూచి మంత్రి రా
జా! యిఁక భావికార్యముల సాంతము దీర్చుట లెస్స యానన్

సర్వసైన్యాధిపతియు విశ్వాసపాత్రుఁ
డతులదోర్విజితాఖిలుం డసమబలుఁడు
రామలింగనాయకుఁ డల్లఁ బ్రభుని సభను
ధీరగంభీరుఁ డై చూచి తెలియఁ బలికె. 62

పది హేనుమాసాల నుదయాద్రి భేదించి
బాలకృష్ణునిఁ దెచ్చె భక్తితోడఁ
గనిగిరికోటపైఁ గాలోష్ణఁగానె విం
ధ్యాద్రిలోఁ బడి వీరభద్రుఁ డడఁగె

గండికోట దుర్గమున్ గ్రహియింప నద్దంకి
తంగేటిదుర్గముల్ దల్లడిల్లె
వినుకొండ నాగార్జునునికొండ బెల్లము
కొండ కేతవరంబు లండ లేక

కృష్ణరాయల విజయ మంగీకరించెఁ
గొండవీటిలో గజపతి కూర్చినట్టి
పాత్రనాయకవర్గమ్ము పట్టు సెడఁగఁ
దిమ్మరుసుప్రజ్ఞ నృపునిశక్తియు ఫలించె. 63

మల్లుఖానుని గర్వంబు మంటఁ గలిసెఁ
బూసపాటిరాచనృపుల పొగరు దగ్గెఁ
జెలఁగుశ్రీనాథుబలములు చితికి పోయె
జన్యమలకసవాపాత్రుఁ జావ మోఁడె. 64

బ్రతుకుదేవుఁడా యని పిక్కబలము సూపఁ
దునిఁగెఁ బశ్చిమబాలచంద్రుని బలాలు
విఱిగె నుద్దండఖానుని విపులశక్తి
దక్కెఁ గొండవీడు మనకు దైవనియతి. 65

కొండపల్లిని జేపట్టకుండ గజప
తుల మదం బడఁగించుట దుష్కరంబు
బలము లాయత్త మయ్యె మీ పలుకు లేక
హద్దులను దాట కం దందె యణఁగె దేవ! 66

ఐదులక్షల కాల్బలం బనుసరింప
గజపతి తన దుర్గంబులఁ గాచుకొనఁగ
వచ్చె నిరువదివేలశ్వబలముతోడఁ
బదియు మూఁడువందలగజబలము గదల. 67

గజపతిరాజుతో మనసు గల్పి తురుష్కులు పాత్రనాయకుల్
విజయపరంపరల్ గొనుటో! వీరులు మెచ్చెడిస్వర్గసౌధమో
నిజ మది తేలిపోఁ గలదు నేఁ డని యెత్తఁగ నుండ్రి మీపయిన్
ధ్వజములు కండ్లు మూసికొని పాలను ద్రావెడిపిల్లికైవడిన్. 68

తెలుఁగుబిడ్డల కఱకుకత్తులపసందు
తెలుఁగుఱేని గుండె నడంగుచలువఁదనము
రుచిని జూచి యా తురకల రోస ముబికె
దెబ్బతినుపులి సుఖనిద్రఁ దేలఁ గలదె? 69

కొండలు గోట లై నిలువఁ గ్రూరతురుష్కులు దండనాథు లై
నిండినసేనతో మనల నీఱొనరింపఁగ రేఁబవళ్లు వే
దండభయంకరారవము దారసిల న్నరిగాపు లైరి మీ
దండును గొండపల్లికడ దగ్ధ మొనర్చెడిదుష్టబుద్ధు లై. 70

కొండకోనలమధ్య నొకొండొకండు
గహ్వరంబునఁ జనురీతిఁ గదల వలయు
వాని కన్నివైపులను మహాటవీప్ర
దేశ మది సైంధవునివలె దెబ్బ తీయు. 71

అని చాలించినఁ గృష్ణరాయలముఖం బావేశమున్ జెందెఁ ద్రో
క్కినత్రాచై చెలరేఁగెఁ గంటికొలఁకుల్ కెంపయ్యె సుల్తానుఁడే
మనతో మాటలు వారితో మనసు లీ మర్యాదఁ బాటించి నె
త్తిని నేస్వర్గము నెత్తుకోఁ దలఁచెనో! తెల్లంబు గాకుండునే. 72

తండ్రి చచ్చినవాఁ డంచు దరికిఁ జేర్చి
తమకులస్థులు గొల్వ సుల్తానుఁ జేయఁ
దగినఫల మబ్బె నేఁడు సత్యం బొనర్చె
శత్రుశేషము తగ దన్నశాస్త్రఫణితి. 73

కడుపులోనఁ గత్తి కనుచూపులో రక్తి
మనసులోన విషము మధురవాక్కు
బౌర సంధిలోని యనుకూలశత్రుత్వ
మెంత కెంత లాచు నెంత సేసె. 74

గజపతిసైన్యముల్ గడగడ లాడుచుం
బంచబంగాళ మై పాఱుదాఁకఁ
బాత్రనాయకసైన్యవర్గమ్ము చట్రాతి
పైఁ గుండపెంకు లై పగులుదాఁకఁ
బొట్నూరికి సమీపమున నాంధ్రవీరుల
దిగ్జయస్తంభ మెత్తించుదాఁక
బహమనీరాజుల బలఁగంబు సెడఁ గుట్టి
సుల్తానుకాళ్ళపై సోలుదాఁక

మనబలంబులు వెనుకకు మఱల రాదు
తిమ్మరుసు సేన స్వయముగాఁ ద్రిప్పఁ గలదు
కత్తి కందాఁక విశ్రాంతి గలుగ దంచు
విచ్చుకత్తిని నొరనుండి పెఱికె నృపుఁడు. 75

రామలింగనాయకా! మనతుంగభ
ద్రాతటిం దురకల దాడి కోర్చి
నిలుపఁ జనుము రెడ్లబలము లార్వీటిరా
జులబలంబు మిమ్ముఁ గొలిచి నడచు. 76

గోవిందామాత్యా! స్వా
భావికముగఁ దమ్ముఁ డగుట భాగ్యంబు ప్రజా
సేవలయందును నప్పా
జీ వెనుకటివాఁడ వగుటఁ జిత్తం బలరున్. 77

శ్రీరంగపట్టణమ్మున
మీరలు మాప్రతిగ నిలిచి, మేల్మే లనఁగా
నీరాజ్యభద్రతలఁ గడు
నేరుపుతోఁ జూచి కాచునిపుణత తెలియున్. 78

విజయోత్సాహము మే మీ
విజయనగర మేల మరలి వెడలెడిదాఁకన్
విజయనగరాధిపతివై
ప్రజలను బాలింపు మింకఁ బ్రభుభక్తి మెయిన్. 79

శపథంబుల్ నృపవర్యులీరు నెదలో సంక్షోభముల్ లేప నే
విపరీతం బౌనఁగూడునో యనుచు నో ర్విప్పల్ భయం బంది సై
న్యపతుల్ మంత్రులు స్తబ్ధులై నిలువఁగా నప్పాజి శ్రీకృష్ణరా
ణ్ణృపసంరక్షణ మెట్టులంచుఁ దలఁపన్ హృద్వీధి, రాజేంద్రుఁడున్

అప్పాజీ! సైన్యంబుల
నిప్పాడే నడపింప వలయు నేమాత్రంబుం
దప్పిన మాజీవంబులు
దప్పును శపథంబు లెటులఁ దక్కింతు రొకో! 81

అనినంతన్ వినయంబుతో నిలిచి మీ యాజ్ఞం దలందాల్చి యీ
దినమే నాలుగుసైన్యముల్ నడిపెదన్ దేవా! ప్రయత్నంబులో
నణుమాత్రంబును లోప ముండ దటుపై నా యీశ్వరాభీష్ట మె
వ్వనికిన్ గోచర మంచుఁ దిమ్మరుసు సంభాషించె నేర్పొప్పఁగన్.

నమ్మక మైనవానిఁ దమ నాయకులందున మేటి రాజ్యకా
ర్యమ్మున దిట్ట నాఁటి నగరవ్యవహారము లెల్లఁ దీర్చుతం
త్రమ్ములలోన నేర్పు గలప్రాజ్ఞుని నెల్లవిధాల నాత్మమా
ర్గమ్మును ద్రొక్కుతమ్ముని ముఖంబును జూచి ప్రియంబుతో ననెన్.

అన్నా! విద్యానగరపు
మన్నన మన మింతదాఁక మంటిమి ప్రాణం
బున్నంతవఱకు నిమ్మహి
నిన్నగరముఁ గావ వలయు నెల్లవిధములన్. 84

తెలుఁగఁ బోనితరంగహస్తములఁ దుంగ
భద్ర మన పట్టణోత్తరభాగమందు
నిలిచి నాయన! కడకుఁ జీమలకు నైన
దారి యిడక నీ శ్రమ కొంత తగ్గఁ జేయు. 85

ఆరుమైళ్ల యూరి కవల డెబ్బది రెండు
మైళ్ల దాఁకఁ బ్రకృతిమాత మూఁడు
దిశలఁ జూడ రాక దేవతాళికి నైనఁ
గొండల ముడి పెట్టె గొలుసువోలె. 86

బుడతకీచులు వచ్చుచుఁ బోవుచున్న
పశ్చిమాచలగహ్వరప్రాంతమందు
నిలుప వలె నోయి స్వామిభక్తుల నెఱింగి
తక్కినపథంబు లన నంతచిక్కు నిడవు. 87

దొర లేనిరాజ్యలక్ష్మిని
బరిపాలన సేయు టన్న బహుదుర్లభ మా
నరివీరులు విఱుచుక పడు
తరుణం బిది నగరు కాచుతత్త్వం బెటులో! 88

మనసున లాలించుచు మన
కనుకూలము లైనకార్య మన్యులచేతన్
జనములు మెచ్చఁగఁ బూఁదే
నెను గ్రోలెడి తేఁటిరీతి నెఱవేర్ప వలెన్. 89

మనసుల మాధుర్యం బర
యనివారల లౌల్య మెఱిఁగి యాశాపాశం
బున వంప వలయు మాంసం
బును జూపినఁ గుక్క లణఁగి పోవుట లేదే? 90

మనసున ద్రవ్యంబున వం
గనిఘటనాఘటితులఁ గడుఁ గపటాత్ముల యు
క్తిని సాధింప వలయు నీ
టను బాసిన జలచరంబు డక్కం గలదే? 91

మనసున ధనమున భేదం
బునఁ జక్కంబడనియట్టిమూర్ఖులఁ దఱిలో
వెను దీయక దుర్మాంసం
బును వైద్యుఁడు తొలుచునటులఁ బుట మార్ప వలెన్. 92

ఎదిరిబలంబుల నరయుచుఁ
బదవికిఁ దగినంత ప్రాభవంబును జూపన్
దుది మొదలు సుఖమయం బై
యదనునఁ బడినట్టివర్ష మై యలరారున్. 93

సమయంబుఁ జూచి శత్రుల
సమయించుట లెస్స పగటిసమయాన దివాం
ధము కాకిముక్కుపోటుల
యమసదనము సేరుచుండు టరయఁగ లేదే? 94

స్థానబల మెఱింగి తమబలంబును జూచి
సమరభూమి కేఁగ సౌఖ్య మబ్బు
నీటఁ గరిని జిల్చి నేలఁ గుక్కలచేత
మకరి చంపఁబడుట మఱవఁ దగునె ? 95

బలము దగనివేళఁ బగతుర భంజింపఁ
జేయుయత్న మెల్లఁ జిక్కుఁ దెచ్చు
నగ్నిముఖముఁ జొచ్చి యణఁగారి పోవదే
శలభవర్గ మెల్ల జాడ లేక? 96

సమయము స్థానము సామ
ర్థ్యము లెఱిఁగి మెలంగ కున్న నన్నా ! మన య
త్నమె కాక యార్ష సామ్రా
జ్యమె ప ట్టొకయింత లేక యణఁగార్పఁ బడున్. 97

అనిన సభాస్థలిం గని నృపాగ్రుఁడు తిమ్మరుసయ్య పల్కులం
దణఁగినశక్తులే యనుభవామృతధారలు రాజనీతిసం
జనితనవీనపుష్పములు శాశ్వత మై తనరారు వీనిచే
మనకును నిమ్మహీస్థలికి మంగళ మౌ నని పల్కెనంతటన్. 98

వినయవిధేయతల్ కరము విచ్చుకరంబులు మోడ్చి రక్తపుం
గణములఁ బొంగుచుండెడియుగంధరతత్త్వము దాఁచి దేశభ
క్తిని రగిలించుమాట నుడికించుచు నెల్లరఁ బల్కె మంత్రి మీ
యనుసరణంబె తిమ్మరుసు నాంతరశక్తికి మూలమయ్యెడిన్. 99

రామదేవుని స్నేహరస మొల్కఁ గపిజాతిఁ
దరియింపఁ జేసినధర్మభూమి
కుక్కలం దఱిమెడికుందేటికోదములు
విహరించుచున్నట్టి వీరభూమి
రాజ్యసంరక్షణార్థము యోగశక్తులఁ
గార్యరూప మొనర్చుకర్మభూమి
సామాన్యమానవజాతిలో దేవతా
మూర్తులఁ దీర్చినపుణ్యభూమి
కదలుచుండెడిగాలిలో ఘనత కలదు
మట్టికణముల మహిమలు పుట్టఁ గలవు
రాజ! పలుమాట లేల యీ ప్రకృతి యెల్ల
నమృతమూర్తిస్వరూప మై యలరుచుండె. 100

ఇందు జనించుప్రాణి యెది యేనియు దివ్యబలప్రయుక్త మా
నందపదప్రదం బగు మనంబులలోని నిగూఢశక్తు లం
దంద యెఱింగి యుజ్వలసభాంగణవేది నలంకరించువీ
రందఱుఁ బూజ్యులే మిగులఁ బ్రాజ్ఞు లటంచుఁ దలంతు నో ప్రభూ!

సృష్టిలోఁ గలగుణములు సిద్ధి పొంది
దైవశక్తుల కెల్లఁ గేంద్రంబు గాఁగ
మనుజజన్మంబు పరిపూర్ణ మై చెలంగెఁ
దెలిసి సాధింప దివ్యశక్తులు ఫలించు. 102

ప్రతిపౌరుండును దివ్యశక్తులప్రభావం బాత్మఁ జింతించి సం
తతదేశాభ్యుదయంబుకై పెనఁగు చంతర్లీనసౌభాగ్య మే
గతి సాధించిన నట్టులే ఫలము లై కల్యాణముల్ గూర్చు సు
స్మిత మారాగము లొల్కవే మధురతంత్రీవాద్యఘోషంబులన్.

కాలచక్రము భ్రమియించు కాలమందుఁ
గష్టసుఖములు వెనువెంటఁ గదలుచుండుఁ
గాన మనుజుండు దైవయోగంబు నాత్మఁ
దెలిసి సమయానుకూలుఁ డై మెలఁగ వలయు. 104

కడుపున మోసి మిమ్ముఁ గని కాలము చెల్లెడిదాఁకఁ బెంచి మీ
బుడుతల వారి సంతతిని బోషణ సేసెడిదివ్యధాత్రి నీ
యెడ నెడఁబాటు సేతురొ! యహీనబలంబుల జాతి కెల్లఁ దో
డ్పడెదరొ! మీ చరిత్ర లిటఁ బావన మందెడికాల మబ్బెఁ గా.

ప్రజల హృత మార్చుశక్తులు ప్రబలి యుండె
జనులఁ గాపాడునమృతరసంబు గలదు
కనుల కానంద మొదవించుకాంతి గలదు
ఏమి సేయునో యీ మేఘు మెఱుఁగ మనఁగ. 106

జగదానందకరం బై
జగతీస్తుత మై సమస్తశత్రుధ్వంసం
బగుకాలం బిది రాజా!
దిగంతవిశ్రాంతకీర్తి దీప్తం బనుచున్ 107

పండువయస్సులో నొసటిపైఁ దళుకొత్తెడిబ్రహ్మతేజ మా
నిండుసభాంతరాళమున నిండఁ బ్రతిధ్వను లీనునెల్గుతోఁ
బండితవర్యుఁ డొక్కరుఁడు పల్కె నవగ్రహతారపంక్తులం
దుండుశుభాశుభస్థితుల యోజన చేసి భవిష్యదర్థముల్. 108

తిమ్మరుసయ్య యాపలుకుతీరు శుభోదయ మంచుఁ దూర్పుభా
గమ్మున నింద్రచాపరుచి గ్రమ్మినజాడ లెఱింగి సర్వసై
న్యమ్ములతోడ నో యమరనాయకులార! బలంబు సూప శీ
ఘ్రమ్మున రండు పొం డనుచుఁ గట్టడి సేసి ముగించె నాసభల్.

ఇది పంచమాశ్వాసము

---

రౌద్రబీభత్సకరుణాదిరసము లెల్ల
నొక్కచోటనే జనియించునో యనంగ
వివిధగమకాంతరముల నీవీణఁ జెలఁగి
యొక 'అఠాణా' మహారాగ ముద్భవిల్లు.

# శ్రా ణ

చిక్కరాయలు కత్తిఁ జేపట్టినంతనే
కర్ణాటసైన్యంబు కదను ద్రొక్కెఁ
గన్నెత్తిఁ జేసినక్షణములోఁ దిరుమల
నాయుఁడు నిజసేన నడచి వచ్చె
మీసంబుపైఁ జేయి వేసెనో లేదో! నా
గమనాయుఁడు బలాలు గంతు వైచెఁ
మేను లుప్పొంగఁ దిమ్మానాయుని భటాళి
గడియలో దూకె సంగ్రామ మనినఁ
గన్నులను నిప్పులు కదలఁ గానె
కమ్మనాయని సేనలు కదలి వచ్చె
గడియలో నేండ్లు నేండ్లలో గడియ గాఁగ
మంత్రి పారాడె రాయల మనసు పొంగె. 1

మూరువంశీయసైన్యముల్ ముసురుకొనియె
నారవీటిబలంబులు నార్భటించె
రెడ్లబలము లుప్పొంగె ధరిత్రి వడఁక
విజయనగరంబు సైన్యాల విడిది యాయె. 2

మంత్రముగ్ధము లగుమట్టిబొమ్మలరీతి
నిలిచి కొలుచుభటులబలము సూపి
రామలింగనాయుఁ డేమేమియో సెప్ప
నవ్వుకొనుచు మంత్రి నడచుచుండె. 3

బలముల నప్పగించి తమపైఁ బడుకర్జముఁ దీర్ప నెంచి బె
బ్బులిగతి శత్రుకంఠముల మూల మడంపఁగ నున్నవాని ను
జ్జ్వలసమదాకృతిం గని ప్రచండబలోజ్జ్వలమూర్తి వాజిలోఁ
బ్రళయభవానలం బరులపైఁ గురిపించెదు కాదె నాయకా! 4

ఈ రుద్రాకృతిఁ గాంచ గుండె లవియు న్నెవ్వాఁడు నీ సాహసో
దారస్థైర్యబలప్రతాపముల విద్యాతత్త్వముం జూచియున్
నీ త్రై పోవక నిల్చునే రణములో నీయంతవాఁ డుండునే?
యీ రాజ్యేందిర యేమి నోచి కనెనో యేమో కదా నిన్నిటన్.

అన్నా! కన్నులపండు వయ్యె భవదీయారాతిసైన్యంబులన్
సన్నాహంబునఁ బాఱఁ దోలెడుమహాచ్ఛౌర్యస్వరూపంబునం
గన్నుల్ గానక ముందు వెన్క లరయంగా లేనియుద్రేకమే
పన్నాగంబుల నెంతవారి నయినం బ్రాణంబులం దీయుఁ గా. 6

పొంగునరాతిసైన్యముల పోటున కోర్చి యెదిర్చి నిల్ప రా
జ్యాంగపుఁ గీర్తులుం బెరుఁగు నాంధ్రుల మెత్తనిజాలిగుండెయున్
సింగపుశౌర్యముం దెలియు సేమము కూడు జగంబు మెచ్చు నె
న్నం గలరామలింగనృపనాయకుఁ డీగతిఁ దప్ప నేర్చునే. 7

సమయము స్థానము సామ
ర్థ్యము లెఱిఁగి మెలంగ కున్న నన్నా! మన య
త్నమె కాక యార్ష సామ్రా
జ్యమె పట్టోకయింత లేక యణఁ గార్పఁ బడున్. 8

గుణము లేనివిద్య గుడి లేని దేవుఁడు
రసమయంబు గానిరమణి యెడఁద
యదుపు లేని సేన హద్దు లేనిబలంబు
చిల్లిగవ్వ కైనఁ జెల్ల దోయి. 9

రణశాస్త్రోచితమర్మకర్మములు జీర్ణం బయ్యె రక్తంబునం
దనుకూలజ్ఞుఁడ వై మెలంగు మని నీకా నేను బోధించుటల్
చను మయ్యా! యిదె పాత్రనాయకుల దాశౌర్యాగ్నిఁ జల్లార్చి వే
నినుఁ జూడం జను దెంతు మంతదనుకన్ నిల్వందగున్ శత్రులన్.

ఎగిరెగిరి నెత్తిపైఁ బడు నెదురు లేని
ప్రబల మౌతరంగపరంపరలఁ జెలఁగు
కడలిగాంభీర్య ముడుఁగక కలఁత నిడక
హద్దులను దాఁట కందంద యణఁగుఁ గాదె. 11

అనినన్ సైన్యాధ్యక్షుఁడు
వినయంబున మంత్రితోడ వివరించెన్ నూ
తనరాజ్యచరిత్రకుఁ గా
రణజన్ముఁడ వీవు గానె? ప్రజ్ఞాసాంద్రా! 12

పొంగుశౌర్యసముద్రతరంగతతిని
హద్దులను దీర్పఁ గాదె మీ యమృతవాక్కు
సకలదక్షిణాపథ మేలుచక్రవర్తి
తమకు బాహ్యస్వరూప మై తనరుఁ గాదె? 13

నియమము నెంచి నీతిని గణించి స్వజాతిపురోభివృద్ధికై
భయమును గ్రోధరాగములుఁ బండు రణావనిలోన మాధురీ
మయ మగు శాంతిసౌఖ్యముల మర్మములన్నియుఁ దెల్పుటన్న వి
స్మయమగుస్వామి! మీపథమె మాకు శరణ్యము పోయివచ్చెదన్.

తమపథానఁ గార్యతత్త్వంబు సిద్ధింప
మాప్రవర్తనంబు మహిఁ జెలంగు
వాయుదేవుఁ డేమి వార్తలఁ దెచ్చునో!
మొదట మొదట మీక విదిత మగును. 15

అని యార్భటిబలంబులున్ గొలువ రెడ్లార్భాటముల్ మీఱ నా
యని వెన్కాడఁగ రామరాజు కరిపై కుంకించి లంఘింప నా
యన మేల్మే లని చేర వచ్చి మనరాజ్యం బెల్ల మీయట్టిశౌ
ర్యనిగూఢాత్ముల చేతిలోఁ దిరుగుఁగాదా యంచు నుప్పొంగుచున్.

సైన్యపుఁదీరు యుద్ధములసార మెఱింగెదు రమ్ము నీదు ప్రా
వీణ్యమె భావిపౌరులకుఁ బెట్టనికోట భవద్బలంబె రా
జన్యుల ప్రాణగొడ్డ మగు హాయిని గూర్చు నటంచు మాటలో
సైన్యవిభుండు హద్దులకు సైన్యములం దరలించె నేర్పునన్. 17

విచ్చుకత్తులు గొలువంగఁ బెండ్లికొడుకు
రీతిఁ బంచకల్యాణిపైఁ గృష్ణవిభుఁడు
వచ్చెఁ దూర్యనినాదముల్ పెచ్చు పెరుఁగ
జయజయార్భటుల్ మ్రోఁగ సకలదిశల. 18

హంపివిరూపాక్షుఁ డనిలోన మిముఁ గాచు
నని బ్రాహ్మణాశీస్సు లభయ మొసఁగెఁ
బూర్వాంధ్రశక్తి మిముం జేరి రక్షించు
నని హారతు లొసంగె నతివ యొకర్తు
శ్రీరామరక్షయై చెల్వారు నని రక్త
తిలకంబు నొకసాధ్వి తీర్చి దిద్దెఁ
గనకదుర్గాదేవి కయ్యంబులోఁ దమ
వారిపై వచ్చి కాపాడు నంచుఁ
గంఠముల నెత్తి పద్యముల్ కవులు పలుక
నాత్మబల ముబ్బె నమ్మకం బతిశయించె
నరనరంబుల కావేశ మురలుకొనియె
సైన్య ముద్భ్రాంత లూఁగె రోసంబు లుబుక. 19

నడిచె గణికాగణంబులు నడిచె వైశ్య
జనము పట్టణం బెల్లను సాగినటుల
హద్దులను దాఁటి చనుదెంచునంబుధిగతిఁ
గొండపల్లిపై రాయలదండు నడవ. 20

కొండదారుల నరికట్టి కుతిక లదుము
శత్రువీరులఁ దునుమ నా స్థలములందు
మఱలఁ జివురించు రావణాసురుని తలలఁ
బోలె శత్రుసేనలు నిల్చి పోరుచుండె. 21

విసుగు విరామముం గొనక వేసటఁ జెందక యాత్మసేన సా
హసమున ముందు దూఁకుచు యమాలయ మాగిరిదుర్గభేదన
వ్యసనవిలీనరక్తి నరివర్గము దాల్చినఖడ్గశక్తిముం
దసువులు కాన్కఁ బెట్టిరి జనాధిపుఁ డంత విషణ్ణచిత్తుఁ డై. 22

మూఁడునెల లయ్యె నడుగైన ముందు పడదు
మాబలంబుల మోసమో మా పటుత్వ
మడఁగెనో! లేక యప్పాజియాత్మ మాటె
నో! కడకు విధి యెదు రయ్యెనో! తలంప. 23

ముద్దు లొలికించి వెన్నెల మురియఁ జేయు
హ్లాదకరుఁ డైనయమృతాంశు నందుకొనఁగ
నింగి కెగఁ బ్రాక నెంచితి నేలమీఁది
కాలు కదలునే యెంతటిఘనుని కైన. 24

అని చింతాశల్యంబున
మనమునఁ దపియించుచున్న మనుజేంద్రుని మె
ల్లనఁ జేరి మంత్రి కడుఁ ది
య్యనిపల్కుల నృపుని భావ మంటి వచించెన్. 25

కార్యోత్సాహపుదీపముల్ వెలుఁగు మీకండ్లన్ గళల్ దప్పెఁజా
తుర్యంబుల్ మెఱయించుఖడ్గములు నెందో నేఁడు నిద్రించె యా
శౌర్యోత్సాహము లెల్లఁ జల్లఁబడియెన్ సమ్రాట్టులం దేటికో
ధైర్యం బన్నది రాచబిడ్డలకు యుద్ధం బందె దీపించుఁ గా. 26

వదనోత్సాహము మీ మొదం గెలుకు భావం బెల్లఁ జూపించెఁ గా
ర్యదశన్ గ్లైబ్యము పొందఁగాఁ దగదు స్థైర్యం బొప్ప సాధింప నా
పద లే క్షాత్రగుణప్రదీపితము లై పక్వస్థితిం బొంది యు
భ్యుదయం బై బ్రతుకే పవిత్రముగ మాఱ్పున్ బొందు నో భూవరా!

పరవీరభయంకరుఁ డౌ
తిరుమలరాహుత్తురాయు తీవ్రత తెగటా
ర్చు రణావని యైనను మీ
చిఱునవ్వు లుడుగక రక్ష సేకూర్చెఁ బ్రభూ! 28

అడుగడుగున కడ్డ మా కొండ లన్నియుఁ
బిండి పిండి కొట్టువేళ గెలుపుఁ
దెచ్చుప్రభుని దివ్యతేజంబు నేఁ డేమొ?
కాన రాక సేన కళవళపడు. 29

అనుకొన్నట్టులఁ గార్యముం దెగు నె? రాజా! యిట్టి యుద్ధంబులన్
మన కేమాత్రము మోక్ష ముండదు సుమా మార్గాంతరంబే విరో
ధిని సాధించును వైరి కీస్థలములోఁ దేజంబు పెం పెక్కునే
కనుఁగొంటిన్ బథ మొండు దాన మనకీ గండంబు దప్పున్ బ్రభూ!

దుర్గమ మయ్యుఁ గొండల నెమర్కొని పై కెగఁ బ్రాక నచ్చటన్
మార్గము దోఁచు మీర లనుమానము లేక భవద్బలంబు లా
మార్గముఁ బట్టి ముందు సన మంటల శత్రులఁ బెట్ట వచ్చు
దుర్గముఁ బట్టవచ్చు మన తొందర లెల్ల నడంగు భూవరా! 31

తిమ్మరుసయ్య వాక్కులను దేజము లంది యిదే క్షణంబు సై
న్యమ్ములఁ గొండపై కెగయు నాబల మంతయుఁ జూపువాఁడ మా
ర్గమ్మును గాచి మీరలు బరాక్రమ మీయెడసూప క త్తెరం
గ్రమ్మినపోకచెక్క లయి కాలునిఁ జూతురుఁ గాదె వైరులున్.

కత్తిని దీసి ముందు కుఱికెన్ బ్రభువర్యుఁడు వెంట నంటె రూ
పెత్తినస్వామిభక్తి గురిపించెడి శౌర్యరసంబు సాహసో
దాత్తచరిత్రలన్ మెఱయు తన్మయు లౌ భటు లెల్ల ముందుకుం
గత్తులతోడ దూఁకిరి వికాసము సెందె నృపాలుఁ డంతటన్. 33

పాములరీతిఁ గొండ కెగ బ్రాకె భటాంగము విశ్వనాథునిన్
స్వామిపదార్చనాపరుని శౌర్యసమగ్రునిఁ బిల్చి పల్కె సం
గ్రామకళావిశారద! యఖండఁబలంబులఁ జూపు మల్లదే
చీమలరీతిఁ దోఁచుపరసేనలఁ బాఱఁగఁ జూడుమో యనన్. 34

ఆగ్రహోదగ్రుఁ డై యరికంఠనాళాంకు
రచ్ఛేదమాత్రలో రగులుకొనఁగఁ
కులగిరికూటముల్ కుప్పిట బంధించి
పిండి నొనర్చునావేశ ముబుకఁ
బ్రళయాభ్రఝంఝాప్రభంజనస్వామితో
సరి గాఁగఁ దమసేన పరువుఁ దీయ
జై వీరనరసింహా! జై హర! హర! మహా
దేవా! యటంచు నల్దిశలు మ్రోవ

భూమి కంపింపఁ గొండలు పొరలి పడఁగ
విశ్వనాథుఁడు రాయలు వివశు లగుచుఁ
ఘోరసమయాన రాయని వీరగణము
పరులపాలికి యమభటవ్రాత మయ్యె. 35

పొగల కోర్వక వెలువడి పొలియునట్టి
పాములవలెఁ బరుల్ మంత్రిచే భంగపడిరి
కాచు ననుకొన్నకొండలే కలఁతపఱిచెఁ
గాని వేళలఁ దమవారె కంఠగతము. 36

ఉన్నట్టు లుబ్బాఁత లూఁపించుపాథోధిఁ
బడవలోఁ జిక్కినపాంథులవలె
బెబ్బులి మందలో విహరించుసమయాన
క్షోభించుగొఱియలగుంపువోలెఁ
గార్చిచ్చు నల్దిశల్ గ్రమ్మినయడవిలోఁ
దప్పించుకో లేనిత్రాచులవలె
భూకంపమున్ రేఁగి పూడిపోయెడివేళ
నటమటించుచు నున్నయార్తులవలెఁ

బరబలంబులు మృత్యుదేవత వరించె
ముందు కేఁగిన నుయ్యిగా ముప్పు దెచ్చె
వెనుకఁ దడసిన గొయ్యిగా భీతిఁ బెంచెఁ
దమబలంబుల జయలక్ష్మి దబ్బు గొనఁగ. 37

బంధింపం బడె గజపతి
బంధుగణంబులు కుమారవరుఁడున్ బలగ
ర్వాంధులు సైన్యాధీశులు
బంధుర మగుకృష్ణరాయభటవర్గముచేన్. 38

సమరోత్సాహము హద్దులన్ నిలుపమిన్ సైన్యంబులం జూచి కృ
ష్ణమహీపాలుఁడు ముందు కేఁగ విజయోత్సాహంబునం బల్కె నా
సమరం బప్పటి కాపమంత్రి తెలుపన్ జాలింపఁ డారా జదెం
త మహాత్ముండో సుఖాసుఖంబుల సమత్వం బంది జీవించుటన్.

వెండ్రుకలఁ జీల్చి సత్యంబు విశదపఱిచి
అణువణువున భవిష్యదర్థంబు నెల్ల
నూఱి పోయుచు నప్పాజి నుడివెఁ దగదు
నింగి కెగఁ బ్రాక నిచ్చెన నిలుచునయ్య ! 40

దూరం బయ్యె స్వదేశలక్ష్మి మనశత్రుస్థాన మత్యంతసే
నారక్షాంచిత మయ్యె దుర్లభము సైన్యం బింక ముం దేఁగుటల్
ఓరాజా! యిటముందువెన్కలు మదిన్ యోచించుటల్ లెస్సయా
వైరిక్షాత్రము మీబలం బిచటనే ప్రత్యక్ష మయ్యెన్ గదా! 41

ఱెక్కలు గల వంచుఁ జుక్కలం దాఁకఁ బై
పైకి నెగయఁ బక్షి బ్రతుకఁ గలదె?
హద్దు లేని దెట్టి దైనను రాజ! నా
శన మొనర్చు నెంత చతురు నైన. 42

దౌడు దీసెడిగుఱ్ఱపుఁద్రాళ్ల నదిమి
పల్లములఁ బాఱఁ బడకుండ బండి నడప
గమ్య మదనులోఁ జేరు సౌఖ్యంబు గలుగు
సారథిత్వంబు నప్పుడే సార్థక మగు. 43

అవలిగట్టు నెఱుంగక యడ్డు లేక
యెన్నిదినము లీ పాథోధి నీఁదుచుంట
కడలి రేఁగునో గాలులఁ గ్రందునో! మన
పడవ సుడిగుండమునఁ జిక్కి భంగ మగునో! 44

అనుభవంబున కొదవనియాశ లెల్ల
గట్లు తెగసిన తెరటాలగతి నశించు
బ్రతుకులో నున్నదివ్యసామ్రాజ్య మెల్లఁ
బట్టు సెడి నాయనా! యిటం బతన మందు. 45

అనుతనమాటల్ నచ్చక
మనుజేంద్రుఁడు ముందు కేఁగ మాటాడిన మం
త్రి నడపె సైన్యము రాజా
జ్ఞను మీఱఁగ రా దదెంతజ్ఞానుల కైనన్. 46

జయభేరి మ్రోఁగింప జమ్మిలోయ వడంకె
లొంగెఁ గొటాము కల్లోల మగుచు
వేంగిదేశపురాజవీథులఁ బడి సేన
రాజమహేంద్రవరంబు గొనియె

గజపతిసేనలం గల్లోలపఱుచుచుఁ
కృష్ణరాయలు ముందు కేఁగుచుండ
రహితాపురంబునం దహితులఁ హతమార్చి
పొట్నూరికి సమీపమున నృపుండు

దిగ్జయ స్తంభ మెత్తించె దిశలు వొగడ
మాడుగులఁ బట్టి మత్స్యవంశస్థుల మద
మడఁచె నొడ్డాదిని జయించె నంత నార
సింహుని సభార్యుఁ డై కొల్చె సేవఁ జేసి. 47

జయపరంపర చాటెడిస్తంభ మొకటి
నాటె నాభరణాదిమాన్యముల నొసఁగి
నారసింహుని సేవఁ గృష్ణప్రభుండు
సేసె చతురంగబలములు సేద దీర. 48

కార్యకారణశక్తి వికాస మంద
భౌతికజగంబె ధ్యేయ మై పరిఢవిల్ల
నైహికసుఖంబులందె బ్రహ్మాత్వ మందు
నా హిరణ్యకశ్యపతత్త్వ మణఁచి తీవు

స్నేహరస మొల్కు మానవస్నిగ్ధతయును
నడలఁ గొట్టించుమృగరాజునతులశక్తి
తగనరీతిఁ గలిసిన హ్లాదత్వ మిందె
కల దనెడినారసింహుని గొలిచె నృపుఁడు. 50

సంజెగాలులఁ బారాడుచక్రవర్తి
ప్రకృతిలో లీన మైనదివ్యత్వ మెల్లఁ
గనులతోఁ గాక మనసుతోఁ గాంచి యనుభ
వార్థ మెట్టిదో యూహల నల్లుచుండె. 51

పదవి సెడ జన్మభూముల వెదకికొనుచు
వచ్చుసురల దేహాంతరప్రభలొ! లేక
పతుల వెదకెడిప్రణయపుష్పాలరాశి
యో యనఁ దెలిమబ్బులఁ బ్రభుం డూహ సేయు. 52

గర్భవతివోలె జలధరాంగన చరింపఁ
బర్వతస్వామి చేతులఁ బాఱఁ జాఁచెఁ
బశ్చిమాశాలతాంగి సంబరము లొలుకఁ
బైఁడిపళ్లెరంబులఁ బట్టె స్వాగత మిడె. 53

జలదశ్యామలనేత్రముల్ దొనఁకుబాష్పశ్రేణు లీభూమిపై
నిలుపన్ నేర్చునొ యీయెడారిమొలకన్! నిర్భాగ్యతన్ గూలునో!
జలధిన్ ముత్తెపుఁజిప్పలోఁ బడి మహాసౌభాగ్యమున్ గాంచునో!
తెలియన్ నేరము సృష్టిమర్మము లిటుల్ దెల్పంగ సాధ్యంబు లే?

ఇంద్రచాపంబు నొకవైపు నేర్పడంగఁ
గారుమేఘంబు లొకవైపు గ్రమ్ముచుండె
ద్వంద్వభావంబు లొకచోటఁ దారసిలుట
ప్రకృతిగుణమొ! లేక విధిప్రభావ మేమొ! 55

వేవెలుంగులో రంగు కన్పింప దోయి
పరమశూన్యాన రంగు కన్పట్టుచుండె
మంచిలోఁ జెడ్డ చెడ్డలో మంచి లేక
ప్రకృతిగుణముచే విపరీతఫలము లొసఁగు. 56

శశికాంతంబులు చిమ్మలై చిలువలై జాల్వారుచుం జేతనా
వశమై పోవఁగ దేహమే మఱచి విభ్రాంతిం జడప్రాయుఁడౌ
రసికస్వాంతుఁ డిదేటివింత మధురాలాపస్వరస్థాయికిన్
వశమా నిచ్చటి కోకిలప్రమద లీపాటెల్లఁ బాటింతురే? 57

మలకకాల్వలఁ జూచి రాయలు దలంచె
నున్నతాగ్రంబునం బుట్టి యుర్విప్రజలఁ
గాచి గడ్డిపోచలఁ గూడఁ బ్రోచు దీని
పున్నెమే మహానది యయ్యె భూమిపైన. 58

కన్ననిసుఁగులఁ జూడకే గావుకొనెడి
యీనిభయదసింగంబు నెఱిఁగి నృపుఁడు
తల్లిలో నింతదారుణత్వంబు నేద
యామయుఁడు పోసెనో యేమొ! యరయ లేము. 59

కొండకోనలఁ బొదరింటిగుంపులందు
నాడుకొనుకోడెనాగుల హాయి నెఱిఁగి
యెంతహృదయ మీ విషములో నిమిడె నంచు
నూహ లనుడోలికల రాయ లూఁగుచుండె. 60

అడవిలోఁ బూల నవ్వించు నమృతశక్తి
చల్లగాలులఁ గదలించు సర్వశక్తి
దిక్కులకు రంగులం బూయు దివ్యశక్తి
యెచటఁ బుట్టెనో! యని నృపుం డెదఁ దలంచు. 61

పూలలో రంగు లెవ్వఁడు పూయుచుండె
శూన్యమునఁ దళ్కు లెవ్వఁడు చూపుచుండె
సూర్యచంద్రుల వెలిఁగించుజ్యోతి యెవ్వఁ
డెవ్వఁ డీ సృష్టిమర్మంబు లెఱుఁగఁ గలఁడు? 62

సరసాస్వాదితమూర్తి యాప్రకృతియే సౌందర్యశాస్త్రంబు లీ
దరులన్ నేర్పుచుఁ బూలబిడ్డలకుఁ బూఁతల్ పూయ గంధంబులన్
విరియం బోవుచుఁ గొన్ని నీటికొఱకై విచ్ఛిన్నమై పోయినన్
విఱుగున్ గొన్ని తుపాను గాలుల వెతన్ బిట్టోర్వఁగాఁ జాలమిన్.

జగదానందముగోరి యొక్కఁడు మహోత్సాహంబుతోఁ ద్రుంచు నా
సొగసుం జూచి యొకండు కోసి సిగపై శోభిల్లఁగాఁ దాల్చు ము
ద్దగు నీపూవులె చూచి చొక్కి చొకఁ డాత్మానందసౌఖ్యంబులో
జగమే కానక పాడుచుండు నవురా సౌందర్య మెబ్భంగిదో! 64

విరికిఁ దావికిని గలచుట్టఱిక మెంత?
తల్లిబిడ్డల కున్న బాంధవ్య మెంత?
సృష్టికిని బ్రహ్మకును గలస్నేహ మెంత?
తెలియవలెఁ గాదె మోక్షముం దలఁచువాఁడు. 65

ఎంద తే పూలపిచ్చిలో భ్రమందినారొ!
ఎంద తే పూలతపములోఁ గందినారొ!
ఎంద తే పూలసౌందర్య మందఁ గలరొ!
తెలియ దని రాయ లూహలఁ దేలుచుండె. 66

చినచినసంజె మేఘములు చిందులు ద్రొక్కుచుఁ బోవ యామినీ
మనమునఁ బండు వెన్నెలల మార్దవ మెవ్వరు త్రోసి పుచ్చి దు
ర్జనమదనోత్కటం బగుని శాసమయంబును జూడఁ బోదురో?
కని కని ముండ్లలోఁ బడువి కాసవి వేకవిహీను లుందురే? 67

క త్తి జళిపించుసుతు నేనిఁ గౌగిలించు
ముండ్ల మొగ్గకు భ్రమరంబు ముద్దు పెట్టుఁ
బ్రణయతత్త్వంబులోఁ గలబాధల రుచి
యంత సులువుగా హృదయంబు కంద దేమొ! 68

తిరిగి తిరిగి యార్జించినతిండి యెల్ల
నోరు దెఱవనిపిట్టల నోట నిడుచుఁ
దల్లి ఱెక్కలచాటున దాఁచుకొన దె?
కన్నమమకార మెవ్వరు గాంచఁ గలరు? 69

ముండ్ల పొదలలో ముందుకుఁ బోయి పోయి
మధురమాధ్వీకరసధార సుధలఁ గ్రోలి
ప్రాణభృంగికిఁ గడుపారఁ బంచి పెట్టు
కోడెతుమ్మెదవలపు లాక్రోశ మవునె? 70

సాంధ్యసమయానఁ బశ్చిమాశాలతాంగి
యందములఁ దిద్దుకొనుచుండ నాత్మవిభుఁడు
అస్తమయ మయ్యె సృష్టిరహస్య మెల్ల
తలఁపులఁ ద్రుంచుగుణముల దాఁగె నేమొ! 71

అని ప్రకృతి చిత్రచిత్రదృశ్యముల నణఁగు
జీవితరహస్యగాథలఁ జింత చేసి
త్రవ్వుకొనుచున్న తలఁపులఁ దనువె కాక
తన్నుఁ దా మఱచె విభుండు తత్త్వదృష్టి, 72

జలపాతశ్రవణోత్సవంబులను జ్యోత్స్నాశైత్యసంస్పర్శలన్
గలకంఠస్వరగీతికామధురిమల్ గంభీరగంగాసము
జ్జ్వలసౌందర్యములన్ బ్రసూనరుచులన్ సంధ్యాప్రశాంతంబులన్
గలియ న్నేరనివార లుందురె? జగత్కల్యాణముల్ హేయమే?

శత్రుసమితివోలె సంజచీఁకటి గ్రమ్మెఁ
బాత్రనాయకు లిదె ప్రబలి రంచుఁ
బిడుగువంటి వార్త విశ్వనాథుఁడు దెచ్చి
పరుగు పరుగులోనఁ బ్రభుని జేరి. 74

పాత్రనాయకు లిదె ప్రతాపంబు వలుక
నాజగన్నాథుఁడే శరణ్యం బటంచు
దేవ! గజపతి మనపైకిఁ ద్రెళ్లె నంచుఁ
గమలనాభయ్య పంపె వేగర్ల ననఁగ. 75

స్వామిభక్తుఁ డౌకమలనాభయ్య పంపు
వేగరుల లేఖలను గొంచు విశ్వనాథుఁ
డరుగుదేర మంత్రిగుడారమందుఁ జొచ్చి
కృష్ణరాయ లొకండె మంత్రీంద్రు నరసె. 76

గొబ్బున నేఁగుదెంచునృపకుంజరుతీరును గాంచి మంత్రి త
బ్బిబ్బులు సెంది రాజ! తమ రీగతి రాతిరివేళ వచ్చుటల్
అబ్బుర మయ్యె సేమమె గదా! తమకున్ దమవారికిన్ ప్రభూ!
ఉబ్బెడిశత్రుసైన్యముల నుక్కడఁగించుఁ గదా స్వసేన నాన్

పాత్రనాయకుల ప్రతాపంబు నా ప్ర
తాపరుద్రుని నిశ్చితార్థంబుఁ దెలుపు
కమలనాభయ్య పంపులేఖలనుఁ జూపి
ధీరగంభీరుఁ డౌచు క్షితీంద్రుఁ డనియె. 78

మీసం బన్నది వారికే పొడిచెనో! మే మెల్ల యుద్ధంబునన్
దాసోహం బని వారిఁ గొల్వ వలెనో! దైవానుకూల్యంబు నేఁ
డా సామ్రాట్టులె గుత్తకుం గొనిరొ! శౌర్యం బెట్టిదో కొంత మే
మా సంగ్రామమునన్ గనుంగొనెద మం చప్పాజినిం జూడఁగా.

నిశ్చలం బగుచూపుల నిఖిలజగతి
నొక్కపెట్టునఁ గబళించునో! యనంగ
నొసలిపైఁ బడుబొమముడుల్ నుడివె మంత్రి
రక్తమం దింకుచాణక్యరాజనీతి. 80

పల్కక మె ముందు భావముల్ పట్టి తఱుచుఁ
దఱుచుచునె కార్యరూపంబు లెఱుఁగు మంత్రి
మానగంభీరమానసం బంతఁ జూచి
మనసునే కాక మెలుఁగును మార్చి నృపుఁడు. 81

యుక్తాయుక్తవిచక్షణాప్రతిభచే నూహించి యానాఁడె మా
శక్తిస్థైర్యము లెల్లఁ దూచి తెలుపన్ సాక్షేపమున్ దెల్పి మీ
సూక్తిం గైకొన నేరమిన్ ఫల మిదే చూపట్టె మన్నించి యే
రక్తిన్ మమ్ముఁ గ్రోతురో యనుచు నారాజేంద్రుఁ డర్థింపఁగన్.

కారుమబ్బులు గ్రమ్మెడికాల మెపుడొ
చందమామకుఁ దెలియునే స్వామి! నావి
కులకుఁ దనరాకలఁ దుపాను తెలిపి తెలిపి
వచ్చుచుండునే యీ రీతి వగవ నేల? 83

కడచినదానికై వగవఁ గాఁగలకార్యము దీఱునే ప్రభూ!
యిడుములు తగ్గునే? పరుల నేగతి నైన జయింపకే మనం
బడుగును వెన్క వేయఁ దగ దట్లని కూడని మొండిధైర్యమున్
జిడిముడిపాటుఁ జూప నది చేటునకున్ మొదలంటు హేతువౌ! 84

అనినంతన్ నెఱవేర్పఁగాఁ గలరు, కయ్యంబందుఁ గష్టంబు, యు
క్తిని గెల్వందగుఁ బాత్రనాయకుల, సాధింపన్ బ్రయత్నించెదన్
ధనరాసుల్ వ్రయ మౌను గాని మన యాప్తశ్రేణికిన్ గీర్తికిన్
దృణమాత్రంబును లోప ముండ దటుపై దేవుండు లేఁడో! యనన్.

భాండాగారాధీశుల
రం డని పిలిపించి తిమ్మరసు కోరుధనం
బిం డని యాజ్ఞ లిడి నృపా
లుం డేగతి మమ్ముఁ బ్రోతురో యను చేఁగన్. 86

శ్రీమదాంధ్రకర్ణాటధాత్రీవరుండు
కృష్ణరాయల నాయకాగ్రేసరు లగు
పాత్రులకుఁ గోరుద్రవ్యంబుఁ బంపఁ బడియె
గజపతిం బట్టి యొసఁగ మీ కాంక్ష దీఱు. 87

అని లేఖావళి పాత్రనాయకుల కా యప్పాజి వ్రాయించి వే
మణిమాణిక్యసువర్ణసంచయములం బంపింప నోడ్రాధినా
థుని సైన్యంబుల నాత్మసేవకులఁ బోఁ ద్రోలెన్ మహామంత్రివ
ర్యుని ప్రజ్ఞాబల మిట్టిదట్టిదని తా నూహింప లేఁ డెవ్వఁడున్. 88

రతనపుఁబేటికల్ తమ శిరంబులపై నిడి మంత్రిసేవకుల్
అతినిపుణత్వమున్ మెఱయ నాపరసేనలఁ బోవుచుండ బం
ధితు లయి నిల్చి రాగజపతిప్రభుచెంత విరోధిచారసం
తతి యని శోధనల్ సలుప స్తంభితుఁ డయ్యెఁ బ్రతాపరుద్రుఁడున్

ర మ్మని పిల్వ లేదు సమరంబున కేఁగఁగఁ జెప్ప లేదు సై
న్యమ్ములతోడఁ దామె పదునార్వురు పాత్రులు వచ్చి శత్రుసై
న్యమ్ముల దగ్ధముల్ సలిపి యాంధ్రమహీపతి కృష్ణరాయకం
ఠమ్మును దెత్తు మంచుఁ గపటంబులఁ బల్కిరి కుట్రదారులై.

జగముల్ ద్రిప్పు ప్రతాపముల్ పలుకుచున్ శౌర్యాగ్నులన్ రేఁపి త్రు
ప్పగుఖడ్గంబుల నూఱి చేతులపయిన్ స్వర్గంబు చూపించి మ
మ్మొగఁ ద్రోలం గలనాయకావళిమనం బింతింత లౌ నంచుఁ గా
నఁగ లే నైతిని మోస మయ్యె మునుఁ గేన్ నట్టేట నా నావయున్.

ఏ మూలో పడిపోవుచుండ నిటు మ మ్మాత్మకీర్తి సౌగంధ్యలీ
లామాధుర్యధునీస్రవంతికలచే లాగన్ బ్రమోదంబునం
దేమో పొందగఁ జేరఁ బూఁబొదలయం దీ కాలకూటాగ్నికీ
లామగ్నం బగుసర్పదంష్ట్రికలు మాయాయుర్బలం బేర్చుఁ గా.

ఎదుటఁ బడి భండనంబున హితులచేతఁ
బట్టువడి శత్రురాజుల బంది యగుట
కంటె నెచటనో కాలంబు గడప మేలు
బ్రతికి యుండిన భాగ్యముల్ పడయ వచ్చు. 93

అని ప్రతాపరుద్రుఁ డాత్మవేగంబునఁ
బరువుఁ దీసె గమ్య మెఱుఁగ కొర !
దైవబలము దప్పఁ దనకంటెనే తన
ప్రేలు పొడుచు ననుట ఋజు వొనర్చె. 94

గజపతిచర్యలం దలఁచి కాలము కూడనివేళ మ్రగ్గదే
గజరిపుశౌర్యముం గడకుఁ గాంతులఁ బాయరె సూర్యచంద్రులున్
విజయ మరాతిసైన్యముల వీపులఁ దట్టి వరింప నుండె నీ
గజిబిజి యేల మళ్లుట సుఖం బని విచ్చిరి పాత్రనాయకుల్. 95

పల్లవుభూములం బడుప్రవాహమురీతిఁ బురోగమించి వి
ద్యుల్లత లౌచు రాయల మదోత్కటసైన్యము దోఁచె శత్రుభూ
వల్లభ ముఖ్యపట్టణముపైఁ బడి కట్టడి సేసెఁ గృష్ణరాడ్
వల్లభుఁడుఁ బ్రధానియు నపారముదంబునఁ దేలి రంతటన్. 96

కటకము సొచ్చి యందుఁ గలకాంచనసైంహికపీఠ మెక్కి స
ద్భటతతి గొల్వఁ గృష్ణనరపాలుఁడు వృత్రునిఁ బోలి స్వర్గమున్
బటుతరశౌర్యతేజమునఁ బాలనఁ జేసెడియింద్రుఁడో యటం
చట వెలుఁ గొందెఁ గృష్ణవిభుఁ డంచు నుతించెనుధీప్రపంచమున్.

ఉత్సాహ:—

'వర్ణనీయకీర్తివైభవా ప్రభూతభూతిదృ
క్కర్ణకుండలావితీర్ణకర్ణదీర్ణహృద్భ్రిమ
ద్దుర్గయారిమానహారిదుర్భరానకార్భటీ
ఘూర్ణమానకొండపల్లికొండవీడుమండలా 98

'అమితప్రతాపబాలార్కవిస్ఫూర్తి చే
పడినఁ గోల్పడియె నయ్యుదయశిఖరి
భేరీధణంధణం ఘోరనాదములచే
వినుకొండదుర్గంబు విఱిగి పడియె
వాహినీసవుతాబువాహముఖంబు రా
లక్కయి కరఁగె బెల్లంబుకొండ
క్రూరరాహుతఖడ్గకులిశధారలచేతఁ
గొలసి చెట్టుగఁ గట్టెఁ గొండవీడు

కూలె బెజవాడ కంపించెఁ గొండపల్లి
పగిలెఁ గటకంబు గగ్గోలుపడియె ఢిల్లి
యేకధాటిగ నీవు దండెత్తి నపుడు
కీర్తిలోపాయఘారేయ! కృష్ణరాయ!' 99

అని కవిపండితజన మా
మనుజేంద్రుని ఖడ్గశక్తి మహనీయోదా
రనయగుణంబులఁ గడు భ
క్తిని గీర్తించెడియదనునఁ గృష్ణనృపతితోన్. 100

ఆ ప్రతాపరుద్రుఁ డణఁగినస్థల మొక్క
భటుఁడు దెలుప మాకు వారికిని వి
రోధ మనుట గలదె? యోధత్వ మెట్టిదో
చూడ వచ్చినాము చూచినాము. 101

రాత్రి నెల్ల వెల్గించు రేరాజుతోడఁ
బగను సాధించెనే పద్మబాంధవుండు
తెరల దాఁగినరాజును దిట్టఁ దగునె?
యోడినంతనే గౌరవం బుడుగఁ గలదె? 102

వ్యామోహం బణుమాత్ర మీ వసుమతీభాగంబుపై లేదు తా
సామర్థ్యంబున ధర్మముం దెలిసి రాజ్యం బేలువాఁ డున్నచో
మే మెల్లప్పుడు నట్టివారి పొరుగున్ మిత్రత్వమున్ వారి దా
క్షిణ్యమోదంతము గోరుచుందు మనుచుం గృష్ణావనీశుం డనెన్.

శత్రుత్వం బనుమాట లేదు మన యీ సామ్రాజ్యతత్త్వంబునన్
క్షాత్త్రోత్సాహము భావిభారతజగత్కల్యాణసౌభాగ్యమున్
స్తోత్త్రోదంచితధర్మరక్షణకునై సూక్తం బగున్ గాన యీ
మిత్రత్వంబె ప్రతాపరుద్రపతికిన్ మేలున్ బ్రసాదించెడిన్. 104

ఓడుగెలుపులు నుయ్యాల లూఁగుచుండు
దాన శౌర్యశక్తులు దూఁచ ధర్మ మగునె ?
ఓడినంతనే సామర్థ్య ముడుగఁ గలదె ?
నివురు గప్పినబొగ్గులో నిప్పు లేదె ? 105

దుర్నిరీక్ష్యుఁ డై వెల్గొందుతోయజాప్తుఁ
డెంత దూరస్థుఁ డై యున్న నేమి కొఱఁత
లోకబాంధవ్య మేమైన లోటు పడునె ?
పద్మినీరాగ మద్దాన భంగ మగునె ? 106

స్వాగత మిచ్చుచుంటిమి ప్రచండబలోజ్జ్వలశౌర్యరాశికిన్
స్వాగత మిచ్చుచుంటిమి ప్రశస్తయశశ్శరదిందుమూర్తికిన్
స్వాగత మా ప్రతాపనరపాలుని కంచు వచించె రాయ లా
త్యాగముక్షాత్రపుంశిఖలఁ దాల్చిన నేర్చునా! హాయిగూర్చునో!

రాయల స్వాగతోక్తి విని రాగగుణంబునుఁ జూచి మెచ్చి తా
మాయలు మాని ప్రేమమయమానసుఁ డౌచుఁ బ్రతాపరుద్రుఁడా
ప్యాయతఁ జేర వచ్చిన శుభం బని చేతులు చాఁచి స్వాగతం
బామెడ నిచ్చె రాయలు మహాత్ముల శక్తి దయామృతంబె కా.

వ్యామోహం బణుమాత్ర మీవసుమతీభాగంబుపై లేదు మీ
సామర్థ్యంబును మీ కుమారుని రణోత్సాహంబుఁ జాతుర్యమున్
సామంతప్రభుశక్తియుక్తియుఁ బ్రశస్తం బౌను రాజేంద్ర! మీ
తో మిత్రత్వముఁ గోరుచుంటి మన సంతోషించి యా రుద్రుఁడున్.

రక్తధారల గెల్చు రాజ్యలక్ష్మిని స్నేహ
ధారలఁ బరులకు ధారవోసి
బంధింపఁబడినట్టిపరిపంథివర్గంబుఁ
బ్రీతితో విడిపించు ప్రేమమూర్తి!
స్వాధీన మాసువిశాలరాజ్యంబులో
దైవప్రతిష్ఠావ్రతంబు నిలిపి
యోడింపఁ బడినట్టియుర్వీశు నీరీతి
మన్నించు క్షాత్రధర్మస్వరూప!
కత్తి చేఁబట్టి కర్మయోగంబు నెఱపు
శౌర్యరసమున నెంత సౌజన్య మయ్య?
యపరకృష్ణావతార మై యలరుమీకుఁ
గడుపులోఁ బుట్టుబిడ్డనే కాన్క యిత్తు. 110

ప్రాజ్ఞుల విరోధమే మహాభాగ్య మందు
మైత్రియు లభింపఁ బుష్పించె మామనంబు
తేనె లోలుక వియ్యంకుఁ డై తిమ్మరసు వి
వాహవిధు లెల్ల నెఱవేర్ప భాగ్య మనుచు. 111

నెయ్యంబునఁ బ్రభుభక్తియుఁ
గయ్యంబున ఖడ్గశక్తి కడతేర్చితి రీ
తియ్యందనము ఫలింపఁగ
వియ్యంబులఁ గూర్పుమయ్య విజ్ఞాననిధీ! 112

అని ప్రతాపరుద్రుఁ డా కృష్ణరాయలఁ
జూచి మంత్రిముఖము సూడ రాజు
మంత్రి కనులఁ గలిపి మనసుల మర్మంబు
మార్చుకొనిరి యంత మంత్రి పలికె. 113

ఓ ప్రతాపరుద్రనృపాల! యుష్మదాత్మ
తెలిసె మనపొత్తు దాక్షిణాత్యులకు శుభము
పరిమళించెడి మారాజవంశమందు
సౌరభము లొల్కుక్రొత్త పుష్పములు పూయు. 114

నేఁటికి రాయల పెండిలి
మాటలు చాలించి మమ్ము మన్నింప వలెన్
బోటునఁ బడి తురకల యా
ర్భాటము లణఁగింప వలయుఁ బ్రౌఢత్వమునన్. 115

జయలక్ష్మీవల్లభుఁ డై
రయమునఁ జనుదెంచుకృష్ణరాయుం డపుడే
ప్రియమున వివాహ మాడు వి
జయనగరం బెల్లఁ జూచి సంతస మందన్. 116

అందుఁ జనుదెంచి వియ్యం
బంది వివాహంబు నెఱపి యల్లుం డత్యా
నందంబున నిడుగౌరవ
మందుకొనన్ వేఁడుచుంటి మాలింపుఁ డనన్. 117

తురకల మద మడఁగింపఁగ
సరగున నేతెంచువాఁడ సైన్యంబులతో
నరివర్గం బడఁగింపని
సరసత్వము నీటిబుడగ జగదీశులకున్. 118

అనునాప్రతాపరుద్రునిఁ
గనుఁగొని శ్రీకృష్ణరాయకంఠీరవుఁడున్
క్షణమాత్రములో సుల్తా
నుని వంచెద మీర లిటు కనుంగొనుఁ డనఁగాన్ 119

బంధుగణంబులఁ బుత్రుని
బంధంబులఁ బాపి యాత్మబంధమున మమున్
బంధించుమి మ్మిటు పనుప
బాంధవ్యపుధర్మ మగునె? పంపింతు సుతున్ 120

సైన్యంబులతో రణప్రా
వీణ్యముఁ జూపి పుట మార్చువిమతస్థుల మీ
రన్యోన్యస్నేహంబుల
ధన్యత్వము నందుఁ డని ప్రతాపుం డనఁగాన్. 121

తిమ్మరుసయ్యా సరే రా
ని మ్మిపుడే బావగారి కేరీతి సహా
య మ్మగుటో నేర్తు రనుచు
నమ్మానవనాథుఁ జూచి యాంధ్రనృపాలా! 122

మన రామలింగనాయని
యనివార్యబలంబున సరిహద్దులు సంర
క్షణ మయ్యెఁ శీఘ్రంబున
మన మాతనిఁ జూచి పరుల మార్కొనఁ దగుఁ గా. 123

అన రాజు సర్వసైన్యం
బును సన్నాహం బొనర్చి ముం దేఁగఁగఁ జూ
చిన యా కుమారరుద్రుఁడు
తన సేనలతోడఁ గలిసె దర్పోద్ధతుఁ డై. 124

ఇరువురి సైన్యానీకము
ధరిత్రి గడగడ వడంకఁ దరలింపఁ బడెన్
సరిహద్దులఁ దమసేనా
తరంగభంగిమలు పొంగఁ దరిసెం ద్రుటిలో. 125

దవ్వునఁ బ్రభుసైన్యంబులు
జవ్వన నేతెంచుచుండ స్వర్ణాభమపరుఁ డై
నవ్వసుధాధీశునిఁ జి
ర్నవ్వుల నెదు రేఁగి మ్రొక్కి నాయకుఁ డనియెన్ 126

తమ యాజ్ఞాపరిపాలనాపరుఁడ నై తౌరుష్కులం బట్టి యం
తము సేయం సరిహద్దులం బొదిఁగి శ్రద్ధాసక్తి వీక్షించుచుం
టిమి దేవా! యొక పెద్ద జవ్వాడా! బలే కేళిం బ్రదర్శింప నా
యమలోకంబును జేర్చినార మిట కా యాదిల్షా రాఁ డేటికో! 127

బలములఁ గూర్చుకొంచు మనపైఁ బడ నుండిరి యంతఁ జూడఁజా
రుల నటఁ బంచినాఁడఁ గడు రోసముతో స్వమతాభిమానసం
చలితమనస్కు లయ్యు మన శక్తిఁ దలంచి పురోగమింపఁ త్రొ
క్కులు పడుచుండి రంచు నృపకుంజర! నామదిఁ దోఁచుచుండెడిన్.

బ్రహ్మశక్తులు వాక్కునఁ బ్రతిఫలించు
క్షాత్రతేజము కత్తిని గానుపించు
వాక్కు కార్యాంతమందు సౌభాగ్య మొసఁగుఁ
గత్తి తొలుదొల్త మిగుల సౌఖ్యప్రదంబు. 129

మనమే ముందుకు దూక మే లని యెదన్ భావింతు నో రాజ! మ
ర్జనసాంగత్యము చేతఁ దెచ్చు విజయోత్సాహంబు దీపింపఁగా
మనసైన్యంబుల ముందు శూలి సమరక్ష్మాభాగమధ్యస్థుఁ డ
య్యును గెల్వం గలవార మిప్పుడు శుభం బై వెల్గు మీజాతియున్.

సరదారుల్ సమయోచితంబుగఁ బ్రభూ! సర్వజ్ఞుఁ డై నాయుఁ డి
త్తఱి మాటాడెను రామలింగనృపుఁ డాద్యంతంబులన్ జూచి నే
ర్పరి యై పల్కె నటంచు మంత్రులు వచింపన్ జ్ఞానవృద్ధుండు తి
మ్మరుసేదో కడుఁ జింత సేయుచుఁ బడెన్ నంతర్మహాక్షోభమున్.

అప్పాజీ! తమభావ మెట్టిదియొ! సైన్యాధ్యక్షుమార్గంబునం
దప్పొప్పుల్ సరి చూచి మాశపథముల్ ధర్మంబు లోకంబులన్
మెప్పింపం గలరాజనీతిపథముల్ మీ రెల్లభంగుల్ మనం
బొప్పింపం గలమార్గ మెల్లపుడు మా కొప్పున్ బ్రమోదం బగున్.

అన రాజేంద్రునిఁజూచి తిమ్మరసు సైన్యాధ్యక్షుఁ డౌనాయుఁడున్
మనకార్యోచితమార్గముం దెలుప నీ మార్గంబె యుక్తం బటం
చునుమంత్రుల్ వచియింప మీశపథముల్ జూడన్ బ్రభూ! యుద్ధమే
మనపై వ్రాలును గాని ధర్మ మిట సూక్ష్మగ్రాహికిన్ శూన్యమా.

పైకి రాజనినిప్పాలు పడకటింటఁ
బడినపాములు పాలలోఁ బడువిషంబు
చేవ గలపరరాజుల స్నేహ మెపుడుఁ
దెల్పకయె మన కొంపలు దీయుచుండు. 134

మాకులంబె శ్రేష్ఠ మటంచు మామతంబె
మిన్న యంచు గుణంబుల నెన్నకుంట
తేనె పూసినపసిఁడికత్తి యిది రాజ!
జాతినే కాక కడకు రాజ్యాలఁ గూల్చు. 135

ధర్మపరులైనరాజు లీతరుణమందు
నోర్పు మెలఁకువయును సమయోచిత మగు
శక్తిసామర్థ్యముల్ చూప సౌఖ్య మబ్బు
నిహపరంబులన్ గీర్తి వహింతు రెపుడు. 136

మనపై దండును బంప లేను పరులన్ మర్యాదతోఁ జూచి క
త్తిని గల్పంగలజాడ లేదు మనమైత్రిన్ వీడి మీ యాజ్ఞ కా
దని యీనాఁటికి మించిపోయినసమస్యల్ లేవు తౌరుష్క లం
చను యుద్ధంబును జాటి రన్నసడి వచ్చుం గాదె మీపై కనన్.

మౌనముద్రితు లైరి యా మంత్రు లెల్లఁ
గాని నాయుఁ డత్యుగ్రవాక్యంబు లొలుక
రౌద్రరసమూర్తి యై పల్కె రాజ! మంత్రి
యనిన మీ రన్నఁ బూజింతు మాత్మలందు. 138

ధర్మము మాసిపోఁ బరమతస్థులపైఁ బడి గొంతు కోయుదు
ష్కర్మ మొనర్చి లేని దొడిఁ గట్టఁ దలంచెడివార మే ప్రభూ!
మర్మ మెఱుంగమే మనల మైత్రిని గోరుచు సర్వసైన్య మే
ధర్మము నెంచి కేంద్రమునఁ దార్కొనఁ జేసిరొ! శత్రురాజులున్.

మనకు వారును వారికి మనము కాక
యొరులు గల్గిరే పరరాజు లొక్క రైనఁ
గుములుకొనుసీర్ష్యతో సేన కూడుచుండెఁ
జేతులను దాట నెవ రేమి చేయఁ గలరు? 140

పరులను నమ్మరా దనుచు భండనమే స్థిర మంచు ధర్మ మి
త్రతఱి సరి లే దటంచు నొకదానికి నొక్కటి పొందకుండఁ ది
మ్మరుసు వచించినా రన భయం బగుఁ గాని నిజానిజంబులన్
దఱిచెడిప్రజ్ఞ మాకుఁ గలదా! యని నాయఁడు కూరుచుండఁగన్.

ముసిముసి నవ్వులున్ నృపుని మోమునఁ జిందఁగ నాయకాగ్రణీ!
రుసరుస మాటలన్ బలికి రోసముఁ జెందఁగ నేల మంత్రి శ -
త్రుసమితిపై నకారణము దూఱుట ధర్మవిదూర మంచుఁ దా
వ్యసనము సెందెఁ గాని పరభాగ్య మడంపఁ దలంచె నెప్పుడో!

సృష్టి నొనరించునానందజీవి యొకఁడు
ఉర్వి నోమెడినిష్కామయోగి యొకఁడు
భువనముల మాడ్చువిజ్ఞానమూర్తి యొకఁడు
ధర్మ మొకటియే భిన్నపథంబు లయ్యె. 143

సమయానుగుణంబుగ ధ
ర్మము భిన్నాకృతులఁ జెంది మాఱుచు నుండున్
సుమనస్కుఁడు జగదానం
దము గోరి శుభంబు నెఱపు తగినవిధమునన్. 144

మీర్కా రనునాతఁడు మన
సర్కారున గుఱ్ఱములకు స్వర్ణము గొని మా
కోర్కెల భంజించి పరుల
సర్కారున దాఁగువాని సాధింప వలెన్. 145

అనఁ దిమ్మరు సా పల్కుల
విని రాజా! తగినమాట వినిపించితి రీ
దినమే యాతనిఁ బట్టిం
డని యాజ్ఞలఁ బంపువాఁడ నాదిల్షాకున్. 146

అని వార్తాహరులం బం
పిన సుల్తానుఁడు బిరుసున నిమతస్థులకా
మనవారిని బట్టిచ్చుట?
యని లేఁ డిటఁ బోఁ డటంచు నదలింపఁగనే. 147

తురకల పరుసందనముం
బరుగున నేతెంచి జరుగువార్తను వార్తా
హరులుః వినిపింపఁగ నం
దఱ మనుకొన్నట్టె జరిగెఁ దామస మేలా? 148

రయచూరు పరిసరప్రాంతముల్ మునుముందు
శోధింప మనవిశ్వనాథుఁ డిపుడు
పయనించుఁ బదివేలభటులతో రాచూరు
కందకంబుల వేయికండ్లఁ దఱచ
మూరువంశపుసైన్యముల్ గొల్వఁ గామనా
యక! శీఘ్రగామి వై యరుగు మింక
నీటిలో జాడలు నెమకుచారగణంబు
లప్పాజికనుసన్న నణఁగి నడచు
గాలితరగల నితరుల కర్మ లరసి
పరుల మర్మంబు చూపులఁ బట్టి తిగిచి
యలలఁ జూచి పాథోధి ముత్యముల నెంచు
తిమ్మరుసు మనసేనలఁ దీర్చి తిద్దు. 149

రామలింగనృపాల! రణరంగభూమిలోఁ
గుడివైపు మీసేన నడప వలయు
నాతని వెనుకఁ దిమ్మానాయకా! మీరు
బలముల నడపుఁడీ ప్రజ్ఞ గలిగి
చిక్కరాయలు తనసేనలు వామపా
ర్శ్వంబున నిల్చి పోరాడుఁ గాక
యతని వెన్నంటియే యరిభయంకరుఁ డౌచు
నాగమనాయకా! నడవు మీవు

నావెనుక నుండు తిరుమలనాయుఁ డనఁగ
సింహగంభీరుఁ డై తనసేన ముందు
పోరఁ గోరుకొనెఁ గుమారవీరుఁ డంతఁ
గృష్ణనృపతి మే లంచు నంగీకరించె. 150

ఏడులక్షల కాల్బలం బేడుగతుల
సప్తనాయకాశ్రిత మౌచు సాఁగుచుండ
నొక్కదిక్కునం దుక్కిరి బిక్కిరి యయి
కృష్ణపా లౌచు సుల్తాను క్రుంగుఁ గాక. 151

కృష్ణ కావల బహమనీనృపుని సేన
తుంగభద్ర కీవైపు హిందువులు నిలుప
హద్దులను దాటె కృష్ణరాయలబలంబు
మధ్య మైదానభూమికి మఱలి వచ్చె. 152

శనిప్రాతస్సమయంబున
మనసేనలు నడవ శుభము మఱుసటిదినమే
రణభేరిఁ మ్రోయింపుం
డని రాయలు నాఁటిరాత్రి యచ్చట గడపెఁ. 153

శత్రుసేనలఁ గల్మషచ్ఛాయ లెల్ల
నఱికఁబడుచుండ సూర్యుని కిరణవహ్ని
రక్తరంజితం బయ్యెఁ బూర్వాద్రి యనఁగఁ
గలకలంబుల సేన మేల్కాంచి కాంచె. 154

ఆంధ్రవీరుల జయలక్ష్మి హారతు లనఁ
బ్రభుని నేత్రకోణంబులు ప్రజ్వరిల్లెఁ
గడుదు గట్టినయాంధ్రులగర్వశక్తి
నృపుని రూప మెత్తఁగ వచియించె నిటుల. 155

పూర్వాంధ్రరాజ్యసంపూర్ణశౌర్యానలం
బిచటనే యెగఁబ్రాకె నెల్లగతులఁ
దాతతండ్రుల రక్తధారల నీ భూమి
పరమపవిత్ర మై పరఁగుచుండె
నీమట్టిలో నెంద ఱిమిడిరో వారల
విఫలగీతములు విన్పించు నిచట
నెన్నిరక్తపుఁగత్తు లీరెండునదులలోఁ
గడిగిరో మనవారు గాంచ లేము

కృష్ణ తుంగభద్ర లిటు మీ కీర్తి పొగడి
స్వాగతం బిచ్చె మీశౌర్యశక్తి చూప
దీవనలఁ బ్రోతురా పితృదైవతములు
పోర రం డోయి రణరంగధీరులార! 156

అని సైన్యంబుల రాయలు
మునుముందుకు నడపుచుండ ఘోరున సుల్తా
నుని గుండెలు పగులం దూ
ర్యనినాదంబులు సెలంగ రాయలసేనన్. 157

తనసేనాపరివార మప్పటికె సుల్తానుండు కృష్ణానదిన్
తనమంత్రుల్ వచియింపఁగా సరభసోత్సాహాన దాటించెఁ గృ
ష్ణనృపాలున్ హత మార్చి హైందవుల రాజ్యం బెల్ల సాధింతు నం
చును బేరాశలఁ గాలగర్భగత మాశోకాగ్నులం దోఁచునే.

ముందున కేఁగి రాయల సముజ్జ్వలసైన్యము శత్రుకంఠముల్
క్రిందఁ బడన్ రణావనిఁ జరింప బిజాపురిసేన లాగ్రహా
క్రందనముల్ సెలంగఁగ బలంబులఁ జూపి తుపాకి గుండులన్
మ్రందఁగఁ బ్రేల్చి గుఱ్ఱము లమాంతము దోలిరి తెల్గువారిపై.

చిక్కినవారిఁ జిక్కినటు చీల్చుచుఁ జెండుచు ముందు దూకఁగా
నుక్కిరిబిక్కి రౌచు నెద నొక్కటి దోఁపక మేనఁ బ్రాణముల్
చిక్కినఁ జాలు నంచుఁ దనసేనలు దిక్కున కొక్క రౌచు వేఁ
బిక్కబలంబు సూప నరిభీకరుఁ డై చను దెంచె రాయలున్. 160

రగులుకొనుచున్న ఫాలనేత్రంబులోని
నిప్పుకణములుగా మండె నృపుని కనులు
కట్టలను మ్రింగి పైపైకి గంతు లిడెడి
జలధిగాఁ బొంగె నృపునిరోసంబు లంత. 161

ఉంగర మూడ్చి యొక్క సుభటోత్తము చేతికి నిచ్చి యిట్లనెన్
సంగరమందు నాతనువు చచ్చిన వెన్కనె శత్రురాజు చూ
డంగలఁ డంతదాఁ కరి నడంపఁగఁ బోరెదఁ జచ్చినన్ మదీ
యాంగన లాచితిం బడ మదాజ్ఞగఁ జాటుము పొమ్ము నావుడున్.

కట్లు దెగుప్రవాహం బై
పెట్లినపేలాలరీతిఁ బెఱసేన పడన్
జిట్లినరౌద్రాచల మై
యిట్లి ట్లన రాక నృపతి యీసునఁ బలికెన్ 163

పాఱినప్రాణముల్ నిలుప వచ్చునె? మీసము లేదె మీకు? మా
పేరుప్రతిష్ఠలం జెఱుపఁ బెద్దల యౌవనభాగ్య మింకఁగా
భారతగర్భమున్ జెఱుపఁ బ్రాణముఁ దాల్చినమిమ్ముఁ గత్తి కా
హార మొనర్చియే రణవిహార మొనర్తు నటంచు నుగ్రుఁ డై 164

నరసింహాకృతిఁ దాల్చి ముం దుఱుకఁ గృష్ణస్వామి వాక్యంబు లె
ల్లరకున్ రోసము పోసె, శౌర్యరస ముగ్రస్ఫూర్తి దేహంబులన్
మఱపింపన్ దెగఁద్రెంపునన్ బరులకంఠాంకూరముల్ ద్రుంచి సం
గర మెల్లన్ నృపవీరులే కనఁబడన్ గంపించె సుల్తానుఁడున్ 165

పొక్కులఁ జీల్చి వైచుచుఁ గడుంగడు రోసముతోడఁ గండలన్
జెక్కలు చెక్కలై పడఁగఁ జెండుచుఁ గ్రొవ్వినవారి గొంతుకల్
గ్రుక్కున మింటిపై కెగురఁ గొట్టుచు సంగర మెల్లఁ దానుగా
నెక్కడఁ జూచినన్ నృపుఁడు మృత్యువిహార మొనర్చె రుద్రుఁడై.

పగ లెల్లఁ బొగ గ్రమ్మఁ బయనించు కారుమే
ఘంబులు పొగ రెక్కి కదలె ననఁగఁ
గను గీటి దిక్కులఁ గనుపించు చపలాల
తాంగన దోబూచు లాడె ననఁగఁ
జెట్లఁ బత్తులఁ గూల్చి చెవిపుటంబులఁ జీల్చు
ప్రళయకాలార్భటీపటల మనఁగ
సచరాచరాత్మకజగతి నెల్లను ముంప
నిబిడసంతతధార నిండె ననఁగఁ

ప్రళయకాలపయోధరప్రతతివోలెఁ
బటుగజాశ్వభటాయుధప్రకర మెల్లఁ
గ్రమ్ముకొని శత్రుసేనలఁ గలఁతపఱిచె
రక్తధారల శ్రీకృష్ణరాయబలము. 167

విజయ మనుకొన్న నోటమి విఱుచుక పడు
నోటమి దలంప జయలక్ష్మి యొరగుచుండు
నోడుగెలుపులు నొకటిగా నుండ వేమొ!
చంచలతయె ద్వంద్వంబుల సహజ మేమొ. 168

కృష్ణరాయలధాటి కొకింత యేనిఁ
దాళ లేమంచుఁ బాఱె సుల్తానుఁ డెల్ల
గతుల సైన్యపతి నలబత్ఖానుఁ డరసి
యాగ్రహోన్మాదపూరితుం డౌచుఁ బలికె. 169

పరువు లెత్తినకొలఁదిగాఁ బరువు లెత్తి
పరువ మడఁచును మృత్యువే పట్టుఁ బట్టి
నిలిచి పోరెడివీరులే నిలుతు రెపుడు
పోర రం డోయి వేవేగ ధీరులార! 170

గజనిమామూ దన్ గడగడ వడంకి
హైందవుల గుండెలే బ్రద్ద లయ్యె నట్టి
కలుకుతురకల కపకీర్తి గలుగుచుండఁ
బిఱికిపంద లై యెచటికో పరువు లెత్త. 171

అని నల్దిక్కులఁ బాఱుసైన్యముల నాహ్వానించి చేయూఁపుచున్
దను వెన్కాడెడిపోర్చుగీసులు బలోత్సాహంబులం బోయ రు
ద్రునిరీతిన్ విహరింపఁ దుత్తుసియ లై దుమ్మై పడన్ హైందవుల్
రణమం దాతఁడు కృష్ణరాయలదరిన్ బ్రత్యక్షమయ్యెన్ వెసన్.

హాహాకారము లుద్భవిల్లె నట సైన్యాధ్యక్షుఁ డౌ ఖానుఁ డు
త్సాహోద్రేకము లుప్పతిల్లఁగ నృపున్ దాకన్ బ్రయత్నింప నో
హోహో యంచు భటుం డొకండ తని దాయోధాశ్వముం గూల్చినన్
దేహం బెల్ల వ్రణాంకితుం డగుచు భీతిం గూలె ఖానుం డటన్.

సలబత్ఖానుని దుస్థితిం గనఁగ రోషం బెల్ల మైఁ బొంగఁగా
బలులం గైకొన నాలుకల్ తెఱచుచున్ బైపైకి నేతెంచుశ
త్రులరీతిం బడి పోర్చుగీసు లచటన్ గ్రోధాత్ములై యెదువం
దలు నొక్కుమ్మడి మూఁగి హైందవుల విధ్వంసంబు గావింపుచున్.

ముందున కేఁగుదెంచి యట మూల్గెడిఖానుని కొక్కగుఱ్ఱ మం
దందఁగఁ జేసి రైనను రణావని తిర్మలనాయుఁ డుగ్రుఁ డై
యందఱఁ జుట్టుముట్ట నొకఁ డైనను దక్కక నల్గి పోయి రా
సందున నెట్టులో బ్రతికి శత్రులచేతికిఁ జిక్కె ఖానుఁడున్. 175

పదనుకత్తులఁ దలల్ పైకెగరింపఁగాఁ
దోకచుక్కలరీతిఁ దోఁచుచుండె
గడ్డంబులం బట్టి కంఠంబులం ద్రుంపఁ
బెటపెటధ్వనులతో విఱిగి పడియె
నణఁగి పాఱెడివారి హస్తాల నదిమి మాం
సపుముద్దగాఁ జేసె సరభసమున
గిలగిలఁ దన్నుకోఁ గీలు మళ్లు విఱిచి
దిశ కొక్కయంగమున్ విసరి వైచె
మెఱపు లేనిమేఘ మకాలమృత్యువనఁ
గాళిగతి దూకి రామలింగప్రభుండు
పోర్చుగీసుల వెన్నంటి పోరుచున్న
పరబలంబుల లీలగాఁ జెఱచి వైచె. 176

నాసికారంధ్రభాగంబునన్ వెలువడి
వేయిత్రాచులు బుస కొట్టి విసము గ్రక్క
నగ్నిగోళంబు లుమిసె నేత్రాంచలములు
ప్రళయభానుఁ డై వదనంబు ప్రజ్వరిల్ల. 177

అతని రౌద్రరసావేశ మరసి పరులు
యుద్ధముల వీడి కాళ్లకు బుద్ధి చెప్పఁ
బిఱికిపందలఁ బొట్టలోఁ బెట్టుకొనుచుఁ
గృష్ణ కృష్ణపిరుల నుతియింప సాఁగె 178

పాఱుచుండెడి శత్రుసేవకులపైకిఁ
గరుల నాగమనాయుండు తఱుమఁ గొట్టెఁ
గొందఱ నవి యుతికి వైచెఁ గొందఱ కట
గ్రుడ్లు పితికి వచ్చెను గాళ్లఁ ద్రొక్కి వైవ. 179

ఖానుఁడు బందిలోఁ బడియె ఖానునిఁ గొల్చెడిపోర్చుగీసులున్
బ్రాణములన్ ద్యజించిరి యపారభటావళి నెత్రుటేర్లలో
స్నానము సేయుచుండుఱుక సాఁగిరి యందఱికంటె ముందు సు
ల్తానుఁడు దంతిపైఁ బడి పలాయన మయ్యె నయోమయస్థితిన్ 180

పాఱెడివారలం దఱిమి పట్టి కతుక్కున గొంతు గోయఁగా
ఘోరన రక్తధార లటు పొంగె బిజాపురిలోనఁ బుట్టె నా
ర్తారవముల్ సతీసుతుల తాపము హెచ్చెఁ దెలుంగుజోదులున్
స్వైరవిహారముల్ సలుప సాఁగిరి ఱేఁడు రసార్ద్రచిత్తుఁ డై.

ఓరణధీరులార! నిలుఁ డోయి నిలుండు రణంబు నిల్పుఁడో
పాఱెడివారిపైఁ బడుట ప్రాణము పోయినపాముఁ గొట్టుటల్
శూరుల కార్యమే? పరులు సూచిన మెత్తురె? మాయమర్మముల్
నేరనివారలన్ నఱుక నేర్చుట యన్నది క్షాత్రధర్మమే? 182

మన మడఁగెన్ దురుష్కులకు మాకు జయంబు లభించెఁ బాదుషా
కదనము వీడి పాఱె మనకై వస మయ్యె బిజాపురంబు నీ
యదనున యుద్ధముం బొసగ దారయచూరును బట్ట శీఘ్రమే
కదలుఁ డటంచు సేనలకుఁ గట్టడి సేసె నృపాలుఁ డంతటన్. 183

అంతము లేనిద్రవ్యము పదార్థచయంబు నరాతిరాజవి
శ్రాంతిగృహంబునం గలఫిరంగులు భూరిగజాశ్వయూథ మిం
తిం తనరానిగోగణము లెల్ల లభింప విభుండు చిక్కనా
కాంతలకాంతి దేవతల కష్టములన్ విడబాఱఁ జూచుచున్. 184

కదనభూముల నిప్పులఁ గ్రక్కువిభుఁడు
అనదమూల్గుల ద్రవియించు టద్భుతంబె?
సాధనావస్థయం దున్న జ్వాలనశక్తి
సాధనానంతరంబునఁ జల్లఁ బడదె? 185

కాన్పు నెఱపి యత్తగారింటికిని నాడు
బిడ్డ ననుపురీతి బిడ్డతల్లు
ల నట నృపుఁడు తగుబలంబుల నొసఁగి పం
పించె వారివారి గృహములకును. 186

తక్క స్త్రీజనంబుల నెల్లఁ దగినకీర్తి
గౌరవం బిచ్చి పంపెడిఘట్ట మఱియ
రాయలచరిత్ర కాక భారతచరిత్ర
నే పవిత్ర మొనర్చె మహీస్థలాన. 187

రయచూరుపైఁ బడ రాయలసైన్యంబు
కృష్ణానదీస్థలి నేఁగుచుండ
బుడతకీచుల నాయకుఁ డొకండు ఫిగరిడో
యనువాఁడు కృష్ణరాయలను జేరెఁ
గోటగోడల శత్రుకోటి నిల్చి తుపాకి
బలముల నాంధ్రులఁ బాఱఁద్రోల
ఫిగరిడో నృపుని మెప్పింప ఫిరంగులఁ
గోటపైఁ గలశత్రుకోటి గూల్చెఁ
గోటగోడల హైందవుల్ గూల్చుచుండ
శత్రునాయకుఁ డేతెంచి సాహసమున
మఱలఁ గోటపై నిల్చినమరఫిరంగి
నతనిపైఁ ద్రేల్చి ఫిగరిడో హత మొనర్చె. 188

కోటలో నున్నపరిపంథికోటి కంత
ఝల్లు మని గుండె లదిరె గుభిల్లు మంచుఁ
గోటగోడలు గొడ్డండ్లఁ గూలిపోయెఁ
దక్కె రయచూరు రాయలతపము పండె. 189

తనకు విశ్వాసపాత్రుఁ డౌతగినవాని
రాయచూరును గాపాడ రాజు నిలిపెఁ
దప్పుకొనుచుండె సుల్తాను దరియకుండ
సంధి కుదిరెడిజాడలు సన్నగిల్లె. 190

ఎదుటఁ బడుచెట్ల వ్రేళ్లతో నెత్తివైచు
నణఁగి మెలఁగెడిగరికల నాదరించు
నాప్రవాహవేగంబుగ నతిశయించె
రాయ లాగ్రహానుగ్రహారాజసంబు. 191

భామినీరాజ్యలక్ష్మికిఁ బట్టుఁగొమ్మ
భద్రమై వెల్గుగుల్బర్గ పట్టె నృపుఁడు
పౌరుషంబున సుల్తాను బందిఁ బడిన
దక్కను నృపాలసుతుల బంధంబుఁ బాపె. 192

పెద్దవానికి రాజ్య మర్పించె, నంతఁ
బిన్నవారలఁ గొల్వునఁ బెట్టుకొనియెఁ
దెలుఁగుకత్తుల తేజంబు దిశల కెగసె
విజయలక్ష్మి శ్రీకృష్ణరాడ్విభునిఁ గొలిచె. 193

'నరసింహ కృష్ణరాయా!
దురమున నీపేరు పేరు తురకలఁ ద్రుంచన్
గరిరాజవరదుఁ డని యీ
కరిఘటములు నిన్నుఁ జూచి గ్రక్కునఁ దిరిగెన్ 194

గవకుల్బల్లిదమయ్యె ఢిల్లికిని మక్కాకోట మేలయ్యె నుం
డువకున్ గ్రొత్తగఁ గొత్తడంబు లమరెన్ బోలేదు చందేరులన్
దవసం బెక్కె బెడందకోట పురకాంతాగర్భనిర్భేదన
ప్రవణం బైనభవత్ప్రయాణజయవార్తం గృష్ణరాయాధిపా !

సమరక్షోణినిఁ గృష్ణరాయలభుజాశాతాసిచేఁ బడ్డదు
ర్దమదోర్దండబెడందకోటయవనవ్రాతంబు సప్తాశ్వమా
ర్గమునం గాంచి శబా సహోర హరిహారంగా ఖూబుఘోడాకితే
తుమకీ బాయల బాయిదే ములికి యందు ర్మింటికిం బోవుచున్.

చెడిపిరా లొత్తినయడుగుఁదమ్ములకును
గట్టుపయ్యెదఁ జించి చుట్టుకొనుచు
బయలైనకుచకుంభపాళులకును జంటి
శిశువుల మాటుగాఁ జేర్చుకొనుచుఁ
గసుగందులకు వడగాలికిఁ జాటుగాఁ
గచభరంబులు విప్పి కప్పుకొనుచు
పీడినతురుము నీవియదాఁక సడలించి
చేలాంతము ముసుంగుఁ జేర్చుకొనుచు
ఖానమల్కవజీరుల మానవతులు
పాటుపరువున నీవు కల్బరిగఁ గొనిన
బ్రమసి దెస చెడి నలుగడఁ బఱతు రౌర
యాహవోపేంద్ర! కృష్ణరాయక్షితీంద్ర!’ 197

అనుచు దరిఁ జేరి నుతియించునల్లసాని
పెద్దనాది కవీంద్రుల విభుఁ డెఱింగి
యుచితరీతుల గౌరవం బొసఁగె నంత
బ్రాహ్మణశ్రేణిఁ బిల్పించి భక్తితోడ. 198

రణరంగంబున దేహముల్ వదలి వీరస్వర్గముం బొందుధీ
రనికాయంబుల నాత్మప్రీతికయి యా రాజేంద్రుఁ డంత్యక్రియల్
జనముల్ మెచ్చ నొనర్చె నంతటఁ దులాసౌవర్ణదానంబు భూ
జనసంతర్పణ లెన్నియో సలిపి విశ్వప్రీతి గావింపుచున్. 199

దక్షిణభారతావని స్వతంత్రత నందె ఋషిప్రయుక్తమై
యక్షయమై సమస్తజగదభ్యుదయం బయి సత్యధర్మసం
రక్షితసౌఖ్యముల్ గలిగెఁ బ్రాంజలినై నిరతంబు జాతి దు
ర్భిక్షు లడంచి ప్రోచునిలువేలుపుఁ గొల్చెద వేంకటేశ్వరున్. 200

అని తలంచి శ్రీకృష్ణరాయలు ససైన్యుఁ
డై కదలి కలియుగవైకుంఠంబు సకల
కల్మషహరంబు యోగీంద్రకాననంబు
భక్తనిలయ మా శ్రీతిరుపతిని గాంచె. 201

నొసటి తిరుచూర్ణ తేజంబు దిశల కెగయఁ
దులసిమాలల హృద్గంధములు జనింపఁ
జిత్కళ లటు తంబూర యై చేత నిలువఁ
బోఁత వోసినవైష్ణవపుంజ మనఁగ. 202

కన్నులర మోడ్చి యేదియో కాంచినటుల
నులికిపడు చల్లనల్లనఁ దెలిసి కొంచు
నాత్మలో నాత్మఁ జేర్చి యైక్యంబు గనుచుఁ
బరవశుఁ డగుతిరుమలార్యుఁ డరుగుచుండె. 203

రాగానందమనోజ్ఞభావముల నేత్రాంభోజపత్రద్యుతుల్
సోగల్ దీరి నిమీలితం బయి జగచ్ఛోభాయమానంబులై
రాగిల్లన్ హృదయప్రమోదము పవిత్రం బై ప్రభాసింప నా
యోగానందపదప్రమం గొలిచె నత్యుత్సాహగీతావృతిన్. 204

భక్తి బుడగలై బుడగలై ఫాలతలిని
జిట్టిముత్యాలరీతి భాసించె ననఁగ
సాత్వికోదయ మహాస్వేదజలకణములఁ
తాళ్లపాక తిరుమలయ్యఁ దాండవించె. 205

మధుమాసోదయసాంధ్యరాగములలో మందస్మితాబ్జంబులో
సుధలం జిల్కెడిరాగభోగములలో జ్యోత్స్నామృతాంభోధిలో
మధు వూరింపుచు మీకళల్ కనఁబడెన్ మాస్వామి యంచాతఁ డా
మధురానందరసప్రపంచమున నిర్మగ్నుండు నై పాడుచున్. 206

రాగసరణి తాఁ గలిసెనో రాగ మాత్మఁ
జేరి యా పరమాత్మలోఁ జేరుకొనెనో!
బాహ్యజగ మెల్ల నిర్జీవప్రతిమ యయ్యె
నా పరంధాముఁ గొలుచు పెద్దన్న కంత. 207

వైష్ణవామృతగీతలఁ బరవశుఁ డగు
తాళ్లపాక తిరుమలార్యు దైవమహిమ

నాదరూప మై ప్రాకి యనంత మైన
సకలసచరాచరాత్మకజగతి నింపె. 208

అనుచు శ్రీకృష్ణభూపాలుఁ డాత్మఁ దలఁచి
భూమి సాష్టాంగదండప్రణామముపడి
భక్తిఁ బులకితగాత్రుఁ డై ప్రణుతి సేయ
విచ్చెఁ దిరుమలయ్య కనులు విభునిపైన. 209

అతినిరాడంబరం బై నయతనికనులఁ
దేనెసోనలు వెన్నెలతీవ లగుచు
దృక్కు లరుదెంచి సామ్రాట్టు హృది నడంగు
భక్తిభావంబు లుబుకఁ బైపైకి రేఁపె. 210

కావ్యశక్తితోఁ గలిసినజ్ఞానశక్తి
యనుభవంబునఁ జూపించునాత్మశక్తి
గలుగు మీవంటిదివ్యులే కల్మషాంధ
కూపపతితులఁ బ్రోచుసద్గుణు లటంచు. 211

మేము వినుకొండ యద్దంకిసీమలందు
మి మ్మొకమహాకవిగఁ జూచి మెచ్చినాము
కాని మి మ్మన్నమాచార్య జ్ఞానశక్తి
యావహించినమూర్తిగా నరయు టిపుడె. 212

స్వామి! మీరు మా యాస్థానసత్కవీంద్రుఁ
డంచుఁ జెప్పుకోఁ గలభాగ్య మందఁ జేయ
మమ్మె కాదు మాసాహితీమండలంబు
సార్థక మొనర్చిన ట్లగు సర్వవిధుల. 213

స్వామినిన్ వీడి ర మ్మనుపాపి గాను
కాని మాపిడు కాపాడఁ గరుణ గలుగఁ
బైఁడిపల్లకిఁ బట్టి మీ బంట నగుచుఁ
పరుగు పరుగున నిచ్చోట వ్రాలువాఁడ. 214

అనునృపాలుఁ గని తిరుమలయ్య పలికెఁ
జిన్నికృష్ణుఁడు మీయందుఁ జిందులాడెఁ
జక్రవర్తిగాఁ గాక నా స్వామి వంచు
నిన్నుఁ జూచితి దేవ! నా పున్నె ముబుక. 215

తాతతండ్రుల ప్రత్యక్షదైవ మగుచు
నన్ను వదలక కాచువెంకన్న నొక్క
గడియ యేని నీ కన్నులు గాంచకుండ
నిలువ లేవు ప్రభూ! యని తొలఁగి పోవ. 216

పులుకపులుకన మేల్కాంచి భూవరుండు
బాహ్యజగ మెల్లఁ గన్పింప భక్తలోక
నాథుఁ బరమపవిత్రు విజ్ఞానభానుఁ
డేఁగుమార్గంబు తా నాత్మ నెఱిఁగి యెఱిఁగె. 217

అరిషడ్వర్గములన్ జయింప నటుపై నానందధామంబు శ్రీ
చరణాబ్జాంకితపావనంబు సకలైశ్వర్యప్రదానంబు ని
ర్జరకేళీనిలయంబు సప్తమగిరీంద్రం బంచు భావింపుచుం
దరియించెన్ నరజన్మ మంచు నృపుఁడున్ దర్శించె శేషాచలున్.

కలిలో భౌతికవాదులై ధనమె ముఖ్యం బంచు భావించి బా
ధలతో నల్గెడిప్రాణికోటుల మమత్వం బెల్లఁ బో లక్ష్మితోఁ

గలబాంధవ్యముఁ ద్రెంచి యార్తుల కిదే గమ్యం బనన్ వడ్డికా
సులపేరన్ వ్రజఁ గొల్ల గొట్టెడి ప్రభూ! చోద్యంబు నీలీలలన్.

గురుఁ డౌ శంకరుఁ డర్చనల్ సలుప భక్తుం డైన రామానుజుం
డు రసోదంచితగీతలన్ బొగడ బంటుంబోలె మధ్వుండు నీ
పరిచర్యల్ పొనరింప మానవులు దేవా! యీభవద్దివ్యసుం
దరరూపంబును జూచి ముక్తిపథ మందం బోదు రశ్రాంతమున్.

భుజగతల్పుఁడ వౌచు భుజగభూషణుఁ డౌట
　　హరిహరాత్మక మంచు నాత్మఁ దలఁతుఁ
దులసీధరుం డౌచుఁ బిలువఁ బూజల నంద
　　హరిహరాత్మక మంచు నాత్మఁ దలఁతుఁ
దిరుచూర్ణ మందుఁ జిచ్చఱకన్ను చూచిన
　　హరిహరాత్మక మంచు నాత్మఁ దలఁతు
నర్ధనారీస్వరూపాత్మకుం డగుటచే
　　హరిహరాత్మక మంచు నాత్మఁ దలఁతు

శ్రీనివాసుఁగాఁ గొందఱు చింత సేయ
శివుఁడ వని కొంద ఱర్చింతు రేవఁడ వైన
నేమి? మనుజజాతిని దరియింప నెలయు
చిద్విలాసుని నినుఁ జేరి సేవఁ జేతు. 221

జ్ఞానశక్తియె మూఁడవకన్ను గాఁగఁ
బరమగంభీర శైవంబు పురుషుఁ డయ్యెఁ
గార్యశక్తి వివిధదశాక్రాంత మగుచు
మధుర మా వైష్ణవమె జగన్మాత యయ్యె. 222

విష్ణుశివతత్త్వసంయోగవిధ మనంగ
జగతికే హాయి స్త్రీపుంససంగత మగు
ధనఋణధ్రువంబుల నిండు తగిలె ననంగ
హరిహరాత్మకమూర్తి! ని న్నాత్మఁ దలఁతు. 223

జ్ఞానశక్తిలోఁ గలిసిన కార్యశక్తి
యద్భుత మగు నిచ్ఛాశక్తి యై మహాత్మ!
నీ స్వరూపంబుగా జగత్సృష్టితోడ
స్థితిలయంబులఁ దలఁపునఁ జేతు వీవు. 224

ఆనందనిలయవిమానముఁ బంగరు
పూఁతల వెలిఁగించె, ముక్తికొఱకు
భక్తిసోపానముల్ ప్రత్యక్షముం జేయు
స్వామికే మెటికల వరుసఁ గట్టె
శ్రీవత్సలాంఛను సేవించి నవరత్న
ఖచిత మహాహారంబు కాన్క లొసఁగెఁ
బత్నీసమేతుఁడై భగవానునకు భూరి
భూదానముల్ సేసి భూధవుండు

సర్వకాలంబులఁ స్వామి సన్నిధాన
మే శరణ్యం బటంచు శ్రీకృష్ణవిభుఁడు
భక్తిలోఁ దాను భార్యలు ప్రతిమ లగుచుఁ
గొండపై నిల్చి నేఁటికిఁ గొల్చుచుండె. 225

ఇది షష్ఠాశ్వాసము

---

అణువణువునం గలయనంత మైనదివ్య
శక్తి పుష్పించి విశ్వసౌజన్య మంద
రాయలవిపంచి లలితానురాగసరణిఁ
గమ్మగాలి 'కల్యాణి' రాగంబు వీచు.

# కల్యాణి

ఉత్తరంబున నారసింహుండు ప్రోవఁ
బూర్వపశ్చిమదక్షిణాంభోధు లంటి
యెవని గుఱ్ఱంబులుం జరియించునట్టి
చక్రవర్తికిఁ బ్రజ యిచ్చె స్వాగతంబు. 1

'నిస్తంద్రప్రతిభాసుధీనుత! దిశోన్మీలద్యశశ్శ్రీవధూ
హస్తాగ్రామలకాయమానమహనీయాంభోజగర్భాండ సై
న్యస్తోమోత్థరజోవ్రజస్థగితకృష్ణాగౌతమీమధ్యభూ
మ్యస్తోత్కలరాట్పురీహరణలీలావార్యశౌర్యోదయా! 2

విరాజవిరాజితము :

నలనృగరంతిభగీరథ భారత నందన కల్ప యనల్ప యశ
శ్చులికితలోక విలోక వధూజన సూన శరాసన మానఖనీ
ప్రళయ ఘనాఘన ఘోష జయానకభాంకృతి భీమచపేటలుఠ
త్కలబరగీ కటకక్షితి రక్షక కన్నడరాజ్యరమారమణా!' 3

ఆంధ్రుల తపఃఫలంబ! మహాద్భుతప్ర
తాప! చండమార్తాండ! జ్యోత్స్నప్రశాంత!
స్వాగతం బోయి మీకు సుస్వాగతంబు
అనుచు నా పెద్దనాదు లాహ్వాన మొసఁగ. 4

ఇంత చల్లనిరాజ దేరీతి శత్రులఁ
జిటికలో గెలిచెనో చిత్ర మయ్యె
బ్రహ్మతేజం బుట్టిపడునిట్టిమంత్రిలో
నీయుద్ధతంత్రంబు లెట్టు మెఱసెఁ
బుంజీభవించినపురుషత్వమో యన
రామలింగని దెంత రమ్యగుణము!
యీదేశభక్తుల కేరీతిఁ గలిగెనో
స్వచ్ఛంద మై యొప్పుస్వామిభక్తి
యెంత పుణ్యమో యీనాఁటి కింతవారిఁ
గన్నులారఁగఁ గాంచుభాగ్యం బటంచు
విరులు చల్లి రేతెంచునావీరులపయి
నంతిపురమునఁ గలచంచలాక్షు లెల్ల. 5

విజయుఁ డై యేఁగుదెంచినవిభుని కంత
విజయనగర మర్పించి గోవిందుఁ డలరెఁ
బరుని ద్రవ్య మాదుహితను బరుని కొసఁగి
హాయిగా నున్నజనకుని యాత్మవోలె. 6

మదమాతంగము నెక్కి రాయలు జగన్మాన్యప్రభావంబునన్
ముద మొప్పారఁగఁ బౌరకోటి కొలువన్ ముత్యంబులన్ బూవులన్
ముదితల్ చల్లఁగఁ బోవుచుండఁ గవితాపుణ్యుండు పెద్దన్న యున్
ఎదు రై వచ్చుట సూచి సంబరముతో నెగ్గెత్తి భాషింపుచున్.

ఓ కవిరాజ! యాంధ్రుల మహోజ్జ్వలశక్తులు రాతిలో సహ
స్రాకృతులై గళించె నట రమ్ము కనుంగొని వత్తు మంచుఁ దా
వే కర మల్లి నాఁడె కవి పెద్దన నేనుఁగుపైకిఁ జేర్చె నౌ
రా! కవిరాజు రాచమునిమూదల నందుల యబ్బురం బకో ౮

ఇద్దఱు నేస్తు లెక్కి జగ మెల్లఁ గనుంగొన సూర్యచంద్రులే
యిద్దర కేఁగు దెంచి రని యెట్టి విచిత్రమొ! యెంత భాగ్యమో
గద్దె నలంకరించిన జగత్ప్రభుఁ డీతఁడు నెల్ల విద్యల౯
సిద్ధిని బొంది మా ప్రజల చిత్ప్రభ రేఁపుమహాత్ముఁ డీతఁ డౌ.

అని వినుతింపఁ బౌరజన మంతట రాజు కవీంద్రుఁ డల్లన
ల్లనఁ జను దేర శిల్పుల కళాప్రతిభల్ కనుగట్టుమంత్ర మై
మనసులఁ దోఁచు నావిజయమందిరముం గని స్తబ్ధులై రి పె
ద్దన మునిఁగె౯ మనోజ్ఞరసతత్త్వసమాధిఁ గళావిదగ్ధుఁ డై. 10

రససమాధి వదలి రాయలం గని కవి
రాజు పలికె నా సరస్వతీవి
పంచి కానినాదవైవిధ్య మెల్ల రూ
పెత్తి రాజ! కండ్ల యెదుట నిలిచె. 11

వేసరశిల్పంబునఁ గల
యా సూక్ష్మపుఁ బనితనంబు నత్యున్నత మై
భాసిలు ద్రావిడశిల్పక
ళాసుస్థిరతయు నిచటఁ గలసె హృద్యం బై. 12

సరససరస్వతీసహితసారసగర్భుఁడె జాతిబండ లే
కరణి సృజించెనో యనుచుఁ గందినశిల్పుల యార్ద్రచిత్తముల్
కరఁగఁగఁ జేసి ప్రాణములుఁ గమ్మని రూపము లిచ్చి బండలన్
సురుచిరతత్త్వముం జిలికి సొంపుల దిద్దిరి యాలయంబులన్.

పచ్చిబంగారుముద్ద లై బండ లెల్లఁ
దలఁచినట్టుల రూపముం దాల్చి యల్ల
వంగుపూఁదీవరీతిగాఁ బ్రాకె రాజ!
శిల్పి యనుభవజ్ఞానంబు శిలలయందు. 14

ఒకవైపు వీరసోద్రిక్తు లై కుంభి
కుంభస్థలంబులఁ గూల్చి రదిగొ!
యొకవైపు శీతనగోపమపర్వతా
గ్రంబుల నెగఁబ్రాకు కాల్బలంబు
లొకవైపు గాలిలో నుఱుకుతురంగపం
క్తుల భూమిపైఁ బడఁ గూల్చువార
లొకవైపు తుములమై యుగ్రమై రక్తంపు
టేర్లలో మొండెముల్ ద్రెళ్లుచుండ

నాంధ్రకర్ణాటవీరుల నద్భుతప్ర
తాప మా కృష్ణరాయల తపనశక్తి
చిత్రచిత్రరూపంబు లై శిలలఁ దోఁప
భువనవిజయ మై జాతి నుప్పొంగఁ జేసె. 15

ఆ కన్ను లెట్టివో యీ నల్లరాత్రిలో
సౌందర్యదేవతాసంజ్ఞ లరయ
నా చేతు లెట్టివో యీ రాతిబండల
దివ్యమూర్తులఁ గాఁగఁ దీర్చి తిద్ద
నా భావ మెట్టిదో యీ కొండగుట్టల
జీవకళల్ దొల్కఁ జేయుచుండ
నది యెంతవారలో యీ కర్కశత్వాన
శాంతిసౌజన్యసంస్కారశక్తి
ప్రతిఫలించెడిభావనాపటిమఁ జూప
సత్యము శివ మై సౌందర్యసహిత మగుచుఁ
ప్రజలఁ దరియింప శిల్పులప్రజ్ఞ విరిసె
రాయలచరిత్ర రాళ్లకే ప్రాణ మిచ్చె. 16

అని భావావేశుం డై
తనువులు పులకింపఁ బల్కుతన్మయునిం బె
ద్దన నల్లఁ జూచి శ్రీకృ
ష్ణనృపాలుఁ డనెన్ గుణము రసజ్ఞుఁ డెఱుంగున్. 17

సచ్చిదానందమూర్తికి శాశ్వత మగు
భాష్య మై విలసిల్లు నీ ప్రకృతిరీతి
శిల్పసామ్రాజ్యలక్ష్మికి శ్రీకర మగు
భాష్య మై తమవాక్కు లొప్పారుచుండె. 18

మనశిల్పకళామందిర
మున శారద గజ్జె కట్టి ముల్లోకములున్
వినుతింపఁగ సర్వకళల్
ధ్వనియింపఁగ నాట్యమాడుతరుణము వచ్చెన్. 19

ఓ కవీంద్ర! పెంచినమీమహోజ్జ్వలకవి
తాశుభాంగి విప్పించుశిరీషకుసుమ
పేశలసుధామయోక్తుల వినఁ దలంచి
యెడఁద పడుచున్నయారాట మెఱుఁగ రొక్కొ! 20

కంటి కగపడురాతిలోఁ గావ్యమల్లు
శిల్పి నగిషీలకన్న విచిత్ర మాచుఁ
గంటి కందనిచేతులఁ గట్టువడని
యమృతరూపంబు సృజియించునాత్మ మీది. 21

స్వామి! మీ సుకుమారభావప్రపంచ
మాత్మ జీర్ణించుకొనుకవితాశుభాంగి
యమృతలజ్జాతిమధురనేత్రాంచలంబు
లనుభవించెడిభాగ్యంబు లంద లేమొ! 22

అనుమహీపాలుహృదయపుటంతు నెఱిఁగి
పెద్దనార్యుఁడు పల్కె మా పెండ్లికొడుకు
ముసుఁగులో నున్నప్రియురాలి ముద్దుటెడఁదఁ
జూడఁ బోవుచు నేటికో సుల్లుఁ బడుట. 23

దరహసితాంకురప్రభలు దాల్చెని కన్గొనలందుఁ జింద రా
గరసము దేహముప్పఁ బులకల్ మొయిఁ బ్రాకఁగ సత్కవీంద్రుఁడున్
నరవరుఁడుం బరస్పరమనంబులలోని నిగూఢభావమున్
ఎఱిగి భవిష్యదర్థ మొకయింత దలంపుచు విచ్చి రంతటన్. 24

సకలసామంతనృపులు విశ్వాసపాత్రు
లైనమంత్రివర్యులు గొల్వ నరుగుదెంచి
రత్నసింహాసనస్థుఁ డై రాజు గొలువు
దీరెఁ బ్రభునిఁ గీర్తింప సుధీజనంబు. 25

జగదానందముఁ గోరి ఖడ్గములతో శాంతిం బ్రసాదించి ధ
ర్మగుణం బెల్లర కెల్లకాలముల స్వార్థత్యాగు లై పంచుటే
తగుధర్మం బని క్షాత్రజాతికి ఋషుల్ స్థాపించి రా ధర్మమే
తగురీతిన్ ఫలియించె రుద్రుని శివత్వం బైనకార్యంబులన్. 26

హరశక్తిం దలఁపింపఁ గంటకుల సంహారంబు గావింపుచున్
హరిమూర్తిం దలఁపింప ధర్మమును బ్రహ్మాండంబునన్ నిల్పుచున్
హరిపుత్రుం డని మెచ్చ భూమిని బ్రజానందంబు సృష్టించినం
జరితార్థం బగురాజధర్మ మపుడే జన్మంబు సార్థం బగున్. 27

ప్రజలే రాజ్యము రాజ్యమే ప్రజలు సామ్రాజ్యంబు సౌభాగ్య మై
విజయోత్సాహము లందఁ జేయునృపునిం బ్రేమించి పూజింప దే
ప్రజ యీ ధర్మము దప్పెనేని విభుఁడే ప్రత్యక్షదైత్యుం డగున్
బ్రజలన్ మాడ్చుచు వారిచేఁబడుచుఁ బ్రభ్రష్టాత్ముఁ డై కూలెడిన్.

జనబాహుళ్యబలంబులం దలఁచి రాజ్యాధీశుఁ డెల్లప్పుడున్
జనముల్ కోరెడి వెల్లఁ దీర్చుటకు శాస్త్రజ్ఞానమర్యాదలన్
గనకే ముందుకు దూకినన్ బ్రభువులే కా దీప్రజల్ కూడ నా
శన మై పోదురు కాన రాజు జనులన్ శాసించి యేలందగున్. 29

దుర్గాధీశులఁ గాంచి య
నర్గళ మహావారల ధిషణాసారం బం
తర్గతమున మెచ్చుచు నై
సర్గిక మహాస్నేహ మొలుక సమ్రాట్టనియెన్. 30

పరబలంబుల నోడింప వచ్చుఁ బైన
వారివారి దుర్గంబులఁ బట్ట వచ్చుఁ
గాని సాధింపఁ బడినదుర్గముల నెల్లఁ
గాచుకొను టెల్లవేళలఁ గష్టతమము. 31

శక్తిబలంబునన్ మనసు కమ్మఁదనంబులఁ జిమ్మి మెత్తనౌ
చిత్తములందు శాత్రవుల శీర్షములన్ విదళించుఖడ్గసం
పత్తులఁ జూపి రాజసము పావన మందఁ జరించుసాహసో
దాత్తచరిత్రలన్ మెఱయుదక్షులు దీర్తురు క్షాత్రధర్మముల్. 32

తిమ్మరుసు కనుంగుఁదమ్ముండ వఖిలప్ర
జాభిమత మెఱుంగుసరసమతివి
గుణగణాల నిధివి గోవిందరాజ! యీ
కడపమండలంబుఁ గావఁ జనుము. 33

చిత్రదుర్గను గావ నశేషబలుఁడు
ప్రాభవోజ్జ్వలుఁ డనుభవప్రాజ్ఞుఁ డరయ
మనకుమారవీరుఁ డరుగు మాకుఁ బ్రతిగ
గొండపల్లిని రామచంద్రుండు గాచు. 34

గుత్తిదుర్గంబు రక్షించు గోపవరుఁడు
కొండవీటి నరయుఁ బెనకొండరాజు
కొండమరుసయ్య యాపెనుగొండ నేలు
ననుచు శ్రీకృష్ణరాయలు నాజ్ఞ లిడుచు. 35

మట్టిబొమ్మలందు మానవత్వముఁ బోసి
తీర్చి దిద్దునట్టిదివ్యులార!
దేశదేశములను దిరిగి జ్ఞానామృత
భాండ మెల్లరకును బంచ వలదె? 36

చులుకన గాకుండఁగ నా
త్మలఁ గలమాధుర్య మరయుదాఁక మదోన్మ
త్తు లగునృపులపై ఖడ్గం
బుల నీడలఁ బఱుపవలయుఁ బుణ్యప్రభువుల్. 37

ఖడ్గశక్తులఁ దెగుకర్జంబు కలకాల
మలరఁ గలదె? మనసు లంటి యున్న
మధురశక్తితోడ మనవలె రాజులు
ప్రజలు దీనిఁ దీర్చుప్రతిభ మీది. 38

కావున మిము నొక్కకడ నిల్పు టన్న ధ
ర్మంబె మాకు వివిధరాష్ట్రజనులు
మిమ్ముఁ జేరఁ గొలువ మీకీర్తు లానంద
సౌరభమ్ము లెపుడుఁ జల్ల వలదె? 39

అని సభ ముగింప నుండఁగఁ
జనుదెంచి భటుం డొకండు స్వామీ! తమ ద
ర్శనభాగ్యంబునకై వ
చ్చినవా రిదె పోర్చుగీసుసేనాధ్యక్షుల్. 40

నావుడుఁ గృష్ణనృపాలుఁడు
వేవేగను వార లెల్ల విచ్చేయంగా
సేవకుల కాజ్ఞ లిచ్చి స
భావిభవత్వంబు పొంగఁ బ్రాభవ మందన్. 41

పోర్చుగీసులు చనుదెంచుభూమిఁ బఱచు
పట్టుబట్టలు పూవులబాట లయ్యె
భావ మగరుధూపంబు లై స్వాగత మిడ
సభ్యు లెల్లరు నిలువంగఁ జక్రవర్తి. 42

వచ్చినవారి కెల్లరకు స్వాగత మిచ్చె నృపాలుఁ డంతటన్
విచ్చినకన్నులం దమృతవీచిక లయ్యెఁ బ్రసన్నతాగుణం
బచ్చుపడన్ ముఖంబు సరసార్ద్రమనఃపరిపాక మెల్లరున్
మెచ్చి నమస్కృతుల్ సలిపి మీసములం జివురింప నవ్వులన్.

దిక్కుల వెల్లఁ జేయు నృపు దివ్యముఖోజ్జ్వలకాంతు లార! పెం
పెక్కినయింద్రభోగ మిట నేఁటికి లేనిసుహృద్గణంబులన్
నిక్కముగా నితండు ధరణీతల మంతయు నేల వచ్చు నం
చెక్కడు కాన్క లం దొసఁగి రెంతయు భక్తిని బౌరకోసులున్.

ఉచితాసీనులఁ జేయ వారల మనం బుప్పొంగ రాజేంద్రుఁడున్
వచియించెం బరదేశవాసులకు సౌభాగ్యంబె? సంతృప్తులై
యిచటన్ మీరు సుఖంబులం గనదరే? యేమేని లోపంబు మీ
కిచటన్ మా ప్రజవల్లఁ బుట్టదు గదా? యింపౌనె మా పోకడల్?

ఈ రాజ్యాచారవ్యవ
హారాహారాదిగుణవిహారంబు లిటన్
మీ రాజ్యమువలె సుఖముల్
కూరుచునో లేక క్రొత్తక్రొత్తలు నానో! 46

ప్రకృతి దయార్ద్రపూర్ణ తమపైఁ గరుణించినరీతి యెట్టులో?
సుకృతి ఫలింప మీ ప్రజలు శోభఁ దలిర్తురొ? మీ నృపాలు రే
ప్రకృతిగుణంబులం దవిలి పావను లై చరియింతురో గదా!
చకితులఁ జేయ మీ చరిత సాంగముగా వినుపింపుఁడో యనన్.

ఫిగరిడోపజ్జఁ గూర్చున్న పేయ సనెడి
బుడుతకీచులఁ బ్రాజ్ఞుండు పుణ్యధనుఁడు
నిలిచి భక్తిప్రపత్తి నంజలి ఘటించి
సార్వభౌముని కెఱిగి వాక్చతురుఁ డగుచు. 48

కొదమసింగంబునకా రసహృదయ మలరఁ
గత్తికొనలందుఁ దళుకు కొత్తజ్ఞానశిఖలు
ధర్మదేవత యపరావతార మైన
స్వామి మిముఁ జూడఁ గన్నులు చల్ల నయ్యె. 49

అమృత మొలుకుదివ్యహస్తంబు చూపుల
రాళ్ళను గరగించురమ్యశక్తి
దిశల కెగయుఖడ్గతేజ మేసామ్రాట్టు
లందు లేనియీశ్వరాంశ మీది. 50

మృదుమధుర మౌ తమ ప్రజల హృదయశక్తి
పుడమితల్లికిఁ బురుటినొప్పుల ఘటింపఁ
బూలవనములై సౌగంధపూరితాని
లప్రభాపించి స్వాగతలక్ష్మి యయ్యె. 51

అన్నమయ మైన మీ భూమి యాదరింపఁ
బ్రాణమయ మైన మీ నీట బ్రతికినాము
జ్ఞానమయ మైన యీ గాలి ఘనతఁ గూర్ప
దేవ! యానంద మయ్యె మీ దివ్యపథము. 52

ప్రకృతిశక్తుల దేవతాప్రతిమ మీరొ!
కాక మీ దివ్యశక్తులు కలయఁ బ్రాకి
ప్రకృతిరూపంబుఁ దాల్చెనో స్వామి! తెలియ
రాదు మీ మహోజ్జ్వలకళాప్రాభవంబు. 53

దేవ! మీ రసహృదయముం దెలిసి నేఁటి
సృష్టిసౌందర్య మెల్లఁ బుష్పించె ననఁగ
వనమహాలక్ష్మి కన్నడప్రాంతమందుఁ
బంచమస్వరస్థాయిని బాట పాడె. 54

అంతు లేని మీ యౌదార్య మాత్మ నెఱిఁగి
విశ్వమానవకోటికి విందు సేయ
ధాన్యలక్ష్మి విశాలాంధ్రధరను జేరి
యన్నపూర్ణామహాదేవి యయ్యె దేవ! 55

ఇంకనియెడారి స్వర్గంబు సృష్టి సేయుఁ
దమిళజగతిని ధనలక్ష్మి తాండవింప
భవదమోఘయుగంధరప్రజ్ఞ లెల్ల
బుద్ధిబలమున వికసించె భూవరేణ్య! 56

ఎద నిండినమీశీవులు
మదమత్తేభంబు లగుచు మహదానంద
ప్రద మై రాజ్యంబున స
ర్వదిశలు విహరించె వివిధవైభవములతోఁ. 57

తమసాహసోజ్జ్వలపరా
క్రమశక్తులు వివిధగతులఁ బ్రాకఁ జవనా
శ్వము లై తిరుగుచుఁ బరదే
శములం దమకుం బ్రతిష్ఠ సాధించెఁ బ్రభూ! 58

స్వామిభక్తిని శౌర్యపుజ్వాల లగుచుఁ
జేరి చూడఁగ రాని మీ వారభటులు
శాంతిదాంతికి నిలయమై సకలదిశల
వెలుఁగుచున్నారు రాజ! మీ విశ్వమందు. 59

జాతిచ్ఛేదకులుం దమ
చేతులఁ బడ మేలు సేయు స్నేహామృతమూ
ర్తీ! తమ వలె తలపైఁ బడు
రాతిని బువులఁ మరల్చు రాజుల్ గలరే? 60

కావిబట్టలఁ గట్టుచుఁ గత్తి గొనక
ధరణి నేలునశోకుని ధర్మశక్తి
దేవ! మీ కత్తికొనలందు దీప్త మయ్యె
రాజసములోఁ బ్రజాశాంతి ప్రతిఫలించె. 61

కత్తిపైఁ గత్తి గలిపెడిఘనత గలిగి
కత్తిపైఁ బూల నెత్తినజ్ఞాని వగుదు
పూలగుత్తుల కత్తుల పొగరు దగ్గ
నబ్బురం బయ్యె స్వామి! మీ యాత్మశక్తి. 62

కత్తిఁ బట్టి పరులఁ గనికరించెడిశక్తి
కలముఁ బట్టి ప్రజలఁ గలఁతపఱిచి
హృదయ మదర నేడ్చి యేడ్పించుశక్తులే
దేవ! నిన్నుఁ జేరి దివ్యుఁ జేసె. 63

విరులు లేక బ్రతుక లేనివిశ్వమందు
మనుజులే కాదు దేవతామాన్యు లగుట
పశువులకుఁ గూడఁ గడు గౌరవంబు గలదు
శిలలు మహిమాన్వితంబులై చెలఁగఁ గలవు. 64

మారోమునగరవిభవం
బేరాజ్యంబునఁ గల దని యెప్పుడు మే మె
న్నో రీతుల నుప్పొంగితి
మీ రాజ్యము చూడ గర్వ మింకినది ప్రభూ! 65

ఈ రాజ్యపుఁదములపు జే
హారికి సరి వచ్చు నేమి యైశ్వర్యమునన్
మారోమునగరభాగ్యం
బారయ నిక్కం బటంచు నాత్మఁ దలంతున్. 66

పొగడుట కాదు మీ ప్రజలు పూజ్యులు సత్యపదప్రదీపకుల్
మగువల యాత్మశక్తి మన మానవలోకమునందు దివ్యశ
క్తిగ నెద నెంచు మా ప్రజలు దేవ! తలంతుము రాజు లన్న నీ
జగమున ధర్మరక్షణకు జన్మముఁ దాల్చిన దేవతాళి గా. 67

మీ నాగరికత మీ జ్ఞా
నానందపదప్రదంబు నద్భుత మగు మీ
మానవసౌహార్దంబును
మానవలోకమునకుఁ దలమానికము ప్రభూ! 68

మృదులసౌందర్యమే మెఱుఁగు లీనుచు విచ్చు
నా శిరీషకుసుమ పేశలముగ
సరసప్రసన్నమే సంపూర్ణ పూర్ణిమా
సాంద్రచంద్రాతప సౌరభముగ
విమలగాంభీర్యమే విస్పష్ట మహామహో
ర్మ్యుల్లాసవారాశి యుబుకు లగుచు
హృదయమాధుర్యమే కదళీవనాంతర
ద్రాక్షాలతాఫల స్తబకములుగఁ
బరిమళించి దిగంతముల్ వ్యాప్తి సెంది
పొంగి పక్వంబు లయ్యె మీ పుణ్య మెల్ల
సకలదక్షిణభారతాశాపథానఁ
గాంచితిమి దేవ! కన్నుల కరువు దీర. 69

రతనాలు రాసులు రాసులుగాఁ బోసి
యమ్ముచున్నారు మీ హంపివారు
ధగధగ మండునాదహనుకీలలఁ బూల
సరులుగాఁ జేతు రీసాధ్వు లెల్ల
రాతిబొమ్మల కైనఁ బ్రాణ మిచ్చు మధుర
మార్దవ మైన మీ మనసుతీపి
విశ్వవాఙ్మయవీధి వెలుఁగులం జింది మీ
దేశకాలచరిత్ర దివ్య మయ్యె

దేవ! యీ ప్రపంచచరిత్ర త్రిప్పి త్రిప్పి
కనులతోఁ బాటు మాయెద గాయ మయ్యెఁ
గాని యిట్లొక్కఁ డైన లక్షలకొలంది
ధర్మవీరుల రక్షించుతండ్రి లేఁడు! 70

వివిధగతుల దేవా! మా
జవరాండ్రకు దువ్వలువల సౌందర్యము నే
ర్పి వలపు లుబికించినమీ
రవసెల్లాల పనివాండ్రప్రజ్ఞ నుతింతున్. 71

లలితకళాస్వతరాజ్యం
బులై కడు నాగరికరాజ్యములు మీ ప్రజ్ఞా
ఫలమె కళారాజ్యం బై
విలవిల్లెను జాతిఘనత విస్ఫుట మయ్యెన్. 72

భౌతికాధ్యాత్మశక్తులు పరిమళింప
గుట్ట లన్నియుఁ బుణ్యంపుఁబట్టు లయ్యె
రాతిబొమ్మ లాత్మానందప్రదము లయ్యె
శబ్ద మీశ్వరాంశంబులఁ జాటుచుండె. 73

ఎటు సూచినఁ బుష్పంబులె
యెటు సూచిన మధురమధురదృశ్యంబులె మే
మెటు సూచిన వజ్రంబులె
యెటు సూచిన దివ్యకళల కిరవౌ దేవా! 74

ఒకచో రసపరవశులై
సకలకళాలంకృతు లగుసౌందర్యనిధుల్
ప్రకటితనాట్యకళాక
ల్పకములుగా నొప్పుదు రిట లాస్యాంగనలున్. 75

ఒకచో సంగీతకళా
నికషోపలు లమృతవర్షిణిని నాలాపో
త్సుకులై సకలచరాచర
ప్రకృతిన్ దృటిలో మఱతురు బ్రాహ్మీమయులై 76

ఒకచోఁ గవితాశిల్పపు
సుకుమారప్రకృతిఁ దలఁచి సున్నితసౌంద
ర్యకళాప్రపంచమందుఁ బు
లకల తనువుల మఱతురు కళారాధకులున్. 77

జక్కవపాటలలోఁ బెం
పెక్కరసామృతఘుటికల నీ జగ మెల్లం
జెక్కినబొమ్మగఁ జేసెడి
జక్కులవాం డ్రిచటఁ గలరు సారస్యనిధుల్. 78

షరిగమపదనిస సంజ్ఞ
స్వరంబుల శిలాప్రతిమలె శ్రావ్యంబుగ మీ
చరితంబును విన్పించుచుఁ
బరిమళములు పంచె నీ ప్రపంచము మెచ్చన్. 79

ఇది యేటి రాజ్యమో! యీ
హృదయంబుల మధురశక్తు లెట్టివో! యేమో!
యిది యే సౌందర్యతపమొ!
యెద కందనిదివ్యజగతి నెవఁ డెఱుఁగుఁ బ్రభూ! 80

నావుడుఁ గబాయికుల్లాయి నాయకుఁ డగు
షిగరిడో కాదరమునఁ బృథ్వీవిభుం డొ
సంగి ఫేయసాదులకు వస్త్రాదు లొసఁగె
సభ ముగిసెఁ గీర్తిలత ప్రాకె సకలదిశల. 81

ప్రాచ్యదేశంబు లన్నియుఁ బర్యటించి
ప్రజల సంస్కృతి రాయల ప్రజ్ఞ లరసి
రాగమయుఁ డౌచుఁ బాశ్చాత్యప్రాంతములకు
జాట వేవేగ రవిమూర్తి సాఁగుచుండె. 82

రతనాలు రాసులు రాసులుగాఁ బోసి
చూడ రారం డని చూపు నొకఁడు
ముంతలఁ జేఁబట్టి ముత్యంపురాసులఁ
గొలుచుచుండెడివారు కొంద ఱచట
శిల్పకళాఖండచిత్రంబులం జూపి
విలుచుకొం డంచు మెప్పించు నొకఁడు
సౌగంధద్రవ్యముల్ సరసంబుగా నిత్తుఁ
జూడ రారం డని చూపు నొకఁడు

విశ్వమోహన మా రాచవీథులందు
నా యపూర్వవస్తుప్రపంచంబు నరసి
కన్నుల కరువు దీరఁ గాంక్షలు ఫలింపఁ
గొసరి కొసరియుఁ గొననట్టిరసికు డెవఁడొ! 83

ఇవి ఖండాతరకీర్తులఁ
జవిరినసాండూరుమణులు సౌభాగ్యఖనుల్
ఇవి వజ్రకరూరం గల
ప్రవిమలవజ్రంబు లనుచు వర్తకుఁ డమ్మున్. 84

వివిధవిధాల విదేశీ
జవరాండ్రకు దువ్వలువల సౌందర్యము నే
ర్పి వలపు లుబికించిన మా
రవసెల్లాలఁ గొనుఁ డనెఁ గిరాటుం డొకఁడున్ 85

అరుణాంశుకోత్తరీయము
చరమారుణకాంతి రుచుల సౌందర్యములం
గురియుచుఁ గాంతలు సౌంద
ర్యరసామృతదీపకళిక లై చరియింపన్. 86

సుమనోనురాగలతికల
సుమసాయకు శస్త్రరుచులఁ జూపులఁ జాతు
ర్యము మెఱయింతురు సంధ్యా
సమయంబునఁ బూవు లమ్ముసరసప్రౌఢల్. 87

తములపుటాకుల నమ్మోడి
సుమగాత్రి గళాంతరమున సాగియించెడిపి
ద్యము చూతు రెపుడు సంధ్యా
సమయంబునఁ దిరుగుచున్న సరసోదారుల్. 88

పచ్చని వెంకాయపట్టల నీడల
ననఁటికంబంబు లందంద వెలుఁగఁ
బల్లవాంకురరోచి ప్రభవింప మృదుల మా
మామిడితోరణాల్ మలయుచుండ
సరససౌవర్ణపుష్పప్రభాభాసితం
బై నూత్న మగుసొంపు లందగింప
వివిధవర్ణరుచిరావిర్భూత మావిద్యు
దుజ్జ్వలజ్యోతిర్లతల్ జ్వలింప
శాయల వివాహవార్తల రాజ్య మెల్ల
మందమందానిలంబులు మధుర మగుచు
సకలసౌగంధ్యముల్ పట్టి స్వాగతంబు
పాడెఁ బెండ్లికార్యంబు లప్పాజి దీర్ప. 89

కటకాధినాథుని కన్య యానన్నపూ
ర్ణను రాజ్యలక్ష్మితో రాజు పొందు
సకలకళాకలాసాహితీలక్ష్మి మా
పెద్దన్న యింటిలోఁ బెరుఁగుచుండె

మంత్రి ప్రజ్ఞాబలమాహాత్మ్య మన్య దే
శాగతు లందందుఁ జర్చ సేయ
భువనమోహన లైనపుణ్యాంగనల్ రాజ
వీథులఁ బారాడ వేడుకగను
శౌర్య మొకవైపు సాహితీచర్చ లొకటఁ
దాంత్రికప్రశంస లొకటఁ దరుణు లొక్క
వైపు చూచి ప్రజల్ మహాభాగ్య మంచుఁ
బొగడు చందంబు గుమి గూడి ప్రొద్దు పుచ్చ. 9(

ఎడ తెఱిపి నెఱుఁగ కేతెంచుచున్నట్టి
పెండ్లివారికి విడిదిండ్లు చూపు
వారు, వలయుభోగభాగ్యోపకరణంబు
లడుగక ముందుగ నందఁ జేయు
వారు, రాజోచితం బౌమట్టుమర్యాద
లందంద ప్రీతితో నణఁగి సలుపు
వారు, పెండిలినాఁటి వైభవం బిప్పుడే
కన్పట్టె నను సేవకాజనంబు
లద్భుతోత్సాహభరితు లై యంతిపురము
లం దటు నిటు తిరుగుచు హాస్యప్రియోక్తు
లాడుకొను చూడిగంబుల నాచరించి
రెంత భక్తి యో వారికి నృపునిపైన. 91

భూపాలరాగ మాలాపితం బౌచు మం
దానిలంబులఁ బడి తరలుచుండె
నస్పష్ట మగుచుండె నభిసారికాపాద
మంజీరమంజులమధురగీతి
స్పష్ట మై వినిపించె జలజగర్భంబునఁ
జెఱవడ్డతుమ్మెద వలపుగీతి
సానఁ బట్టఁగ జాతి చైతన్యశక్తుల
నరుణోదయారంభ మయ్యె దేవ!
పసిఁడివెలుఁగులు తెలు పెక్క పాయ మబ్బెఁ
దెలుఁగుజాతిని మేల్కొల్పఁ దెల్లవాఱె
మేలుకో స్వామి! యని నృపు మేలుకొలుప
సాంధ్యగీతిక పాడె నుషఃకుమారి. 92

నవలావణ్యము దిద్దికొంచు నుష స్నానం బాడి లేనవ్వులం
బువులం గోయుచుఁదూర్పుకొండపయినింబూజింపఁగా నిల్చె బాం
ధవుఁ డేతెంచు నటంచుఁ బద్మ ప్రణయాంతర్లీనలజ్జాస్య యై
నవులం దాఁచుసుగంధమాలికలనే నై వేద్య మిచ్చెన్ ప్రభూ! 93

కాలపుహొంతగాఁ డిదె జగం బనుమల్లుర కేళికావనిం
గ్రాలఁగఁ జేయు చాయరుణకాంతుల వచ్చుచు నుండె నేఁటికు
స్త్రీల పటుత్వమందుఁ దమ దేహపుఁజాలనముల్ ప్రజాళి మే
ల్మే లని మెచ్చుకొందు రని మేల్కొనఁ బాడిరి వందిమాగధుల్.

నకులుని మించినాఁడు జననాయకుఁ డాశ్వికలాఘవంబునం
దిఁక మనయశ్వవేగ మొక యింత కనుంగొనఁ జూపు మంచు నూ
త్నుకతను గూర్చి సారథిని దొందర వెట్టుచు వచ్చుచుండె స
ప్తకిరణుఁ డో ప్రభూ! తమప్రభావము సూపఁగ మేలుకో వలెన్.

నిగనిగలాడు క్రొన్నెఱులు నిండి వెలుంగఁగఁ దైలమర్దనన్
సొగసులు గుల్కఁగాఁ బ్రకృతిసుందరి రాగరసస్వరూపి యై
మొగ మొక యింత నెత్తెఁ దమమోహనరూపముఁ జూడ మేలుకోఁ
దగు నని మజ్జనాచరణతైలముఁ దెచ్చిరి కొంద ఱంగనల్. 96

అని వైతాళికగీతికల్ చెవులలో హాయిన్ బ్రసాదింప న
ల్లన మేల్కాంచి దినోచితంపుఁ బను లెల్లం దీర్చి నిష్ఠాత్ముఁ డై
తన కిష్టం బగుదేవునిం గొలువ శ్రద్ధాసక్తి కృష్ణాలయం
బున కేఁగెన్ బులకాంకురమ్ము లెగయన్ బూజించె నాదేవునిన్.

విరిసి విరియనివిరులనే విఱుచుకొనియుఁ
బండి పండనిఫలములే పట్టుకొనియు
నిండి నిండనిభక్తిని నిలిచినాఁడ
గసరి వైతువో? దేవ! నన్ గనికరింతొ? 98

సంజకు రాగరేఖలు ప్రసాద మొనర్చినదివ్యశిల్పి! యి
కంజదళంబులన్ నిగనిగల్ మెఱయించెడిస్వాదుమూర్తి! నా
మంజులగీతికన్ మధురమానస మొల్కఁగఁ జేయుస్వామి! ప్రే
మాంజలి నిచ్చుకొందును రసార్ద్రమనఃపరిపాకసిద్ధికై 99

వేదశిఖరాగ్రములలోఁ బవిత్ర మైన
ప్రణయజీవనసౌందర్యభాగ్యదాయి
యుబుకు లెత్తుచు నెచటికో యుఱుకుచుండె
స్వామి! దాని యారసతత్త్వసార మేమొ! 100

ప్రకృతి సౌందర్యసిద్ధి కీ ప్రణయబాధ
విశ్వకల్యాణసృష్టి కీ వెఱ్ఱితనము
నాత్మచైతన్యశక్తి కీ యతులతపము
నెటులు సేతువో దేవ! యే నెఱుఁగకుంటి. 101

చివురుటాకుల నునుపునఁ జిక్కుకొంటి
సంజ విఱిగినసరసిని జాఱి పడితి
మల్లెమొగ్గల నవ్వులో మాయ మైతి
నెచట నుంటినో దేవ! యే నెఱుఁగ కుంటి. 102

అమృతానందమరీచిమాలికల రాగాలాపనస్థాయిలో
సుమనోవల్లరి రాగభోగములలో జ్యోత్స్నామృతాస్వాది నై
యమనస్కం బగుయోగమార్గమున బ్రహ్మానందసౌందర్యరా
జ్యములో నాడుచుఁ బాడుకొందును మహాత్మా యేటికీవాసనల్?

పదునాఱువేల గోపస్త్రీల నేత్రమే
నిగ్రహానుగ్రహానియతిఁ దెలుపు
రాజభోగము లహోరాత్రంబు లందులే
నిష్కామకర్మంపునిజముఁ దెలుపుఁ

బుత్రార్థమై శివపూజలన్ సలుపుచే
యూర్ధ్వరేతస్కు డం చూహా గొలుపుఁ
బుణ్యపాపములందుఁ బూజ్యుఁ డౌనిను దేవ!
సామాన్యమానవజాతి యెఱుఁగఁ

గలదె? కామినీకాంచనాక్రాంత మంచుఁ
బిఱికిపంద లై యోగు లీ ధరను వీడ
నంది యందక యిచటనే యమృతమూర్తి
వైతివో కృష్ణ! కృష్ణ! కృష్ణా! నమస్సు. 104

స్వామీ! యందము చిందునీకనులు నీ సంగీతసారంబు నీ
ప్రేమోన్మీలనదివ్యశక్తి నను నేడ్పించున్ ప్రభూ! జీవితం
బేమో యర్థము గానిబాధల కలం చీబంధముల్ ద్రెంచి నీ
లో మమ్మున్ మఱి నీవె మేముగ నిటన్ రూపింపఁగాఁ జేయవే.

యుగయుగాలనుండి యుడుగక నినుఁ బ్రభూ!
వెదకి వెదకి కడకు విసిగి పోతి
దరియుకోలఁది నీవు దవ్వుదవ్వుల మృగ
తృష్ణవోలె నెటకొ! తేలి పోదు. 106

కాళ్లు పడిపోయెఁ గన్నులు కలయఁ దిరిగె
నంతు లేనిపథంబున నాశలఁ బడి
గమ్య మెఱుఁగనిగనానఁ గలఁత పడుచు
భావవిహంగ మెచ్చోటికో! పరువు లెత్తు. 107

జననమరణరహస్యాల సత్య మెఱుఁగ
వేదవేదాంగముల్ త్రిప్పి విసిగి పోతిఁ
దలలు బ్రద్ద లై పోయె నర్థంబు గాని
వెంట్రుకల ముడి యిది దేవ! విప్ప నెటుల? 108

తాళఁగ లేని యీ హృదయతాపము వీణలఁ ద్రెంచి వైచె నా
పూలవనంబులన్ గడకు బూడిద సేసె భవన్మనోజ్ఞలీ
లాలయ మా ప్రపంచము కళారహితం బగు వల్ల కాదు నై
పేలవ మాచు దేవ! వెఱపించును నీ విటుఁ జూడకుండినన్. 109

రాళ్లు దయతోడఁ బలుకునా బ్రతుకుఁ జూచి
కాని స్వామి వారల కేమొ కరుణ రాదు!
మనసు లేదో? మాటాడెడిమతము కాదో?
యేదియును లేక చిఱునవ్వు లేల చిలుక? 110

అంతకోపమే మీయెద నణఁగి యున్న
నింత సొగ సైనకనుల న న్నేల చూడఁ
బిలిచి యెదలోన నెదఁ జేర్చి ఫలము లిడక
కసరి యీరీతి ఱాయిగా మసల నేల? 111

ఎద విప్పి మాటలాడఁగ
నిది మంచి సమయము గాదో! యెవ రైనను ని
న్నదలించి పల్క కని నా
కెదు రైరో! యోర్చు టెటుల నీ మూఁగవెతల్? 112

పలుకు లుడిగిననవ్వు లే బాధ పెట్టుఁ
గరుణ చూపనికన్ను లే కలఁత వెట్టు
మనసు లేనిమీరూపమే మాడ్చి వైచుఁ
దాళ లేను ప్రభూ! యని తహతహపడు. 113

ఆమ్మ కెగఁదన్నుభక్తి కోపమ్మువలని
బెద్దపెద్దగఁ గన్నులు విరియఁ బాఱి
ములుకు లై దేహ మంతయుఁ బులక లెగయ
బాహ్యజగ మెల్ల మఱచి యా ప్రభుఁడు వలికె. 114

ఏ నొక ప్రేమవాది నని యేటికిఁ బ్రేలెద వోయి విశ్వక
ల్యాణమె లక్ష్యమార్గ మని యాత్మఁ దలంచెదవేని రమ్ము సం
ధ్యానవమల్లికామధుసుధారసధారలఁ జిందునందనో
ద్యానవనాంతరమ్ము లమృతత్త్వముఁ బోయఁగ నా ప్రజాళికిన్

కాసుకుఁ జెల్లనట్టి తమ గాథలు లోక మెఱుంగఁ బోనిస
న్న్యాసులు పెద్దపెద్దగ జనంబులచెంత వచించి రిప్పు డా
మోసము లెల్ల బైటఁ బడ మూఁగతనంబును దాల్చి క్రొత్త దా
వేసము మార్చినావు నిజవీరులు కాళ్ళకు బుద్ధి సెప్పఁగన్. 116

కన్నుల జెప్ప వాల్పక జగంబులలోని ప్రజాళి నెల్ల ని
ట్లెన్ని దినంబులం గనెద వేగతి నైన దోసంగు వుట్టునో
యన్నతలంపునన్ దమరహస్యము లన్నియు మాని వొచుఁ గూ
ర్చున్న నెఱుంగమే? హృదయసూత్రములం బెకలించుపోకడల్

ఇఁక నీయాటలు కట్టిపెట్టి కను మోయీ! యీ జగం బెల్ల ని
న్నొకఁ డైనన్ బరిహాసముల్ సలుపఁ డీయుర్వీస్థలిన్ మమ్ము న
మ్మక యీ చీఁకటికొట్టులో నిలువ నేమాత్రంబు చింతింప కే
నొక జోహారు నొనర్తు నీకిదె ప్రభూ! యుత్సాహివై యేలుమా.

అని జోహారు లొనర్చి ధ
రణీవిభుం డంత ప్రక్కప్రక్కలఁ గల యా
జన మిటు లిటు లనఁగాఁ జ
య్యన భక్తిరసప్రభావుఁ డై చనుచుండెన్. 119

ప్రక్కలో నున్న శిల్పులప్రజ్ఞ విరియు
నా హజారరామస్వామి యాలయమున
కేఁగుదెంచి నృపుండు భక్తిప్రపూరి
తాత్ముఁ డై కేలు మోడ్చి సాష్టాంగ మెఱఁగి. 120

నరుఁ డయ్యుం బితృభక్తి ప్రేమయుఁ బ్రజానందంబుఁ బాటించుక
ర్మరతుం డై వెలుఁగొంద యోగిజన మశ్రాంతంబుఁ గాంక్షించు నా
పరమానందపదోత్తమం బిటనె లభ్యం బంచు రూపించె మీ
చరితం బంతయు దేవ! యంచు నినవంశస్వామికిన్ మ్రొక్కెడిన్.

అచటనుండి కదలి హంపివిరూపాక్షుఁ
జేరి దేవదేవ చిత్తజారి!
తరతరాలనుండి తరియించినారు మా
వారు మీ దయాప్రభావమునను. 122

ప్రభుని యాత్మదీపంబుఁ జేపట్టుఁ డనుచు
నర్చకుం డెత్తుకర్పూరహారతి శివ
మూర్తి గుండెలోఁ దోఁచెఁ బ్రభుం డెటింగి
కన్నులర మోడ్చె బాష్పంపుఁగణము లురల. 123

మన్మథస్వామినే మసిఁ జేసి యేటికో
హిమశైలకన్యకాధీశుఁ డగుట?
సచరాచరాత్మకజగతిఁ ద్రుంచుచు భక్త
వత్సలుం డనుపేరుఁ బడయు టెటులొ?
భూతంబులు పిశాచముల్ చుట్టుఁ గదియ జ్ఞా
నానందమూర్తి వౌ టద్భుతంబు
వికృతిస్వరూపి వై విమలేందుమూర్తి వై
కాటి నష్టోపభోగంబు లందు
టెట్టులో దేవ! మీచర్య లెవ్వఁ డెఱుఁగుఁ
బ్రతిఘటనలోఁ బ్రభుత్వంబుఁ బౌరుషంబుఁ
గరుడు గట్టెను స్వామి! మీ గాథ లరయ
శక్తి లేక శివత్వంబు సాగదేమొ? 124

అని సాష్టాంగనమస్కృతుల్ సలిపి కావ్యానందమాధుర్య మం
దనిజన్మం బది యేల జీవితమునన్ దైవత్వముం జూపి లా
లనతోఁ బాలన సేయుసుందరకళాలాపప్రభారాజ్య మం
త నృపాలుం డటఁ గాంచెఁ బండితసభాస్థానంబు కీర్తింపఁగన్.

వేదవేదాంగాది వివిధవిద్యాలతల్
విరిసినసుమము లై విప్రు లలర
శారదాహృదయప్రశాంతనీలాకాశ
నవరాగ రేఖ లై కవులు వెలుఁగ
శివపాదనూపురోద్భవనాదమే రూపు
గైకొన్న వాగ్గేయకారు లలర
సచరాచరప్రపంచము సృజించువిరించి
భావంబు లై శిల్పవరులు వెలుఁగ
సుందరసుకుమారమనఃప్రశోభితు లగు
రసికు లొప్పార మణిపీఠి రాజు నిలువఁ
బెద్దనార్యుఁడు కొలు వుండెఁ బెద్ద యగుచు
నాలలితకళామందిరప్రాంగణమున. 126

కృష్ణుఁ డనువృద్ధపండితాగ్రేసరునకు
శారద తలంపునఁ నిల్చె సభను జూడఁ
జేతఁ బట్టఁగ వీణాసజీవతంత్రి
యలలవలె లేచె నానంద మాత్మలందు. 127

రసికుల యింద్రియోజ్జ్వలపరాక్రమశక్తులు కన్నులఁ వెలిం
గె సభికు లల్ల నల్లన నదృశ్యము లందుచు నుండ గీతికా
భ్యసనతపంబులో వయసు వచ్చినవృద్ధుఁడు కృష్ణపండితుం
డసమకళాస్వరూపముగ నాయెడ స్పష్టముగాఁ గనంబడెఁ. 128

చివర కతండు కూడ రససీధువులోఁ బడి మాయ మయ్యె నీ
భువనములన్నియుం దొలఁగ పూర్వరసోద్భవనాదమాధురుల్
శ్రవణపుటాంతరాళమునఁ బ్రాకి యెఱుంగని దివ్యశక్తులన్
ద్రవ మగుజీవకోటు లట బ్రహ్మములోఁ బడి లీన మయ్యెడిన్.

గానానందరసామృతోదధిని మున్కల్ వేయు నా ప్రాణు లే
ధ్యానోన్మీలనయోగమార్గమునఁ దత్త్వాన్వేషు లౌజ్ఞానులో?
యానందాంబరవీథిపై కెగయు నా యవ్యక్తు లౌజీవులో?
మే నెల్లన్ బులకాంకురోజ్జ్వలము లౌ మిన్నేటి రాయంచలో?

ఊహల కంద రానిమహిమోన్నతవీథులఁ దేలువారి ను
త్సాహరసస్థితాంతరపథంబుల జాడ లెఱింగి తెల్ప నే
సాహసమూర్తులో తెలియఁ జాలము తన్మయమూర్తి భావనా
వ్యాహతటిల్లతల్ పలుక ముందుకు వచ్చిన స్పష్ట మౌ నొకో!

ఉన్న దున్నట్టుగా నుజ్జృంత లూఁపించు
పాథోధి భీషణార్భటులు దోఁచె
నంతలో నంతనే యది వోయి సింహశా
ర్దూలసంకులము లుద్భూత మయ్యె
నది యేమియో యని యదిరిపడఁ బ్రలయ
ఝంఝాప్రభంజనస్వామి వచ్చె
నాగాలి సుడివడు చటమటింపఁగ నెదల్
వగిలించు పెటపెటార్భటులు ప్రోఁగెఁ

పంచభూతాత్మకం బైన ప్రకృతిశక్తి
యొక్కసారి విజృంభించుచుండె ననఁగ
భయదనాదసముద్ధూతపవనవీచి
పొంగుపొంగు లై వీణలోఁ బొరలి పడియె. 132

వీనులు కన్నులౌచు నతిభీకరదృశ్యము లెల్లఁ జూడ నా
ప్రాణులు రాతిబొమ్మ లని భ్రాంతి జనింపఁగ స్తబ్ధు లైరి వీ
ణానిల మల్లనల్లన రసాంతరరాగతరంగమాలికో
ద్యానలతాంగి యై వెడలె నాత్మగుణంబులు దోఁప రాళ్ళకున్.

అలసాలనానిలం బరుదెంచెఁ గలికికో
యిల గొంతులోఁ జిక్కువలపు లెగయఁ
దొలిసిగ్గు తెర దీయ వలపుమొగ్గల నవ్వు
చిలికించె వెలఁదివెన్నెలలు విరియ
మొయిలు తిన్నెలమీఁద హొయలుగాఁ జరియించెఁ
జపలాలతాంగన సౌరు మెఱసి
హిమశైలశృంగాగ్ర మెక్కి భూదేవి కౌఁ
గిలిఁ గోరు నేటిపాటలు నదించెఁ

ప్రకృతిసౌందర్యశోభాప్రపంచ మెల్లఁ
గనులఁ గట్టఁగ హృదయాలు కరఁగి పోవ
లలితలలితానురాగవల్లరులు పెనఁగ
నమృత మొలికించి జగతికే హాయిఁ గూర్చె. 134

కొండకోనలఁ గోనేటఁ గుట్మలముల
రాగ మిగురొత్తఁ జరియించుప్రణయవీచి
శివునిజడలఁ దగుల్కొనుచిన్నదాని
తనువు పూఁబుల్క లెగయుగీతముల విసరె. 135

మధురమధురనాదానందపథముఁబట్టి
కొదమగాలులు విహరించుకోన లరసె
సాగరసమీపసైకతస్థలము లరసె
నరసె నరయ లేనిజగంబు లాత్మ లెల్ల. 136

మఱచిరి సభాస్థలంబును
మఱచిరి గానామృతపదు మఱచిరి వీణన్
మఱచిరి దేహస్ఫురణల్
మఱవఁగ లే రైరి వారు మధురజగంబుల్. 137

నాదమాధుర్య మంత మాంద్యమ్ము గాఁగ
నున్న దున్నట్టు భూమిపై కూడి పడిరి
సభ్యు లెల్ల రత్యద్భుతస్వాంతు లగుచు
ముదుసలిఁ గళాతపఃప్రభాపుంజ మరసి. 138

కాలపురుషుఁ డొసంగిన కాయశక్తి
క్షణక్షణ మతండె హరియించు కాని వాణి
సరససంగీతసౌందర్యశక్తి పక్వ
మై యిచటఁ గృష్ణపండితుం డయ్యె ననిరి. 139

సంధ్యాప్రశాంతవిశాలనీలాంబర
జ్యోత్స్న యాధ్రువతార శోభఁ దోఁప
దివ్యాప్సరఃకాంతి దీపింప నూత్నలా
వణ్యలక్ష్మీస్వరూపం బనంగ
సకలసంపత్కళాసౌందర్యరచిత యా
జ్యోత్స్నాభిసారిక సొగసువోలె
యోగాసనారూఢుఁ డౌస్థాణు ననురక్తుఁ
జేయుచైతన్యలక్ష్మీస్వరూప
మనఁగ మూర్తిభవించునాట్యంబువోలె
భువనమోహనలావణ్యమూర్తి యొకతె
వచ్చె నర్ధచంద్రాకృతం బైన యొక్క
చంద్రకాంతశిలామయస్థానమునకు. 140

అతివ యేతెంచుక్షణమునం దచటి జనుల
కంటిపాపలు స్తంభించి కదలకుండెఁ
జెవులఁ జల్లనైనమధురారవము సోకె
దేనె లూరించు నెడఁదలు తెలివి దప్పె. 141

లయ దప్పనిబ్రహ్మాండపు
నియమంబున సరిగమపదనిస లనునాదా
ధ్యయనంబునఁ గల్గినవి
స్మయశక్తులఁ జూపె నాట్యచాతుర్యమునన్. 142

గడియమాత్రంబె స్తంభించుకనుల కంత
నొక్కమూర్తిని జూచుచు నుఱవడి గొని
పాదరసముగాఁ జలియించె వారి కనులు
వివిధరసముల వెదఁజల్ల వేడుకగను. 143

భగ్గుభగ్గున మండుప్రళయతాండవమూర్తి
రౌద్రరసస్వరూపాద్రి పగిలె
నంతలో నంత నే యాజలార్ణవమ్మోలఁ
బవ్వళించినపసిపాప దోఁచె
నా పాపనవ్వులో హాయి సూచెడివేళ
శవముపై నటియించుశక్తి దోఁచె
నా శక్తి ఘోరదృశ్యంబునం గంపింప
సకలచరాచరాత్మకజగంబు
పువ్వువలె వికసించె నంభోజగర్భుఁ
డంత సరసిలోఁ దేలుదృశ్యంబు లరసి
పరవశం బంద నాఁటి సభాజనంబు
అతివ నాట్యకళాప్రౌఢి నతిశయించె. 144

పడగ విప్పినపాపరాపడుచువోలెఁ
గొండలం దూకుసెలయేటికొదమవోలెఁ
బవనచలితలతాతన్వివలె నవస్థ
కనుగుణానురక్తిగ విచిత్రాంగి యయ్యె. 145

అతివ చలితవసనాంచలచంచల
ద్యుతి చపలాలతాద్యుతులఁ దోఁపఁ
గాంత కటాక్షవీక్షల కొనల్ గలనవ్వు
శరదిందుచంద్రికాసరణిఁ దోఁపఁ
దరుణి కరాంగుళీతారుణ్యరేఖలు
సంధ్యానవాంశుల ఛాయ లొలుక
రమణి నాట్యకళాపరవశస్థితాంగ ము
త్ప్రాంత లూఁపించుపయోధిఁ దోఁప
బహువిధానర్ఘ భావనాప్రకటనమునఁ
బ్రౌఢ యై తాళరాగభావప్రభావ
మభినయావస్థలం దప్పటప్పటికిని
మించి నవరసానంద మొల్కించె నంత. 146

తమిళకర్ణాటసంస్కృతాంధ్రకవిగణము
లాత్మవిరచితకావ్యంబు లల్లఁ జదువ
సభ్యు లందంద నుతియింప సార్వభౌముఁ
డాలకింపఁ బెద్దన రసత్వంబు తెలిచె. 147

పండితాఖండలశ్రేణిఁ బాఱఁ జూచి
గద్దెపై నుండి పెద్దన కంఠ మెత్తి
దివిజగంగాస్రవంతికతీరు దోఁపఁ
బరమగంభీరమూర్తి యై పలుక సాఁగె. 148

కాలాగ్నిరుద్రుని కంటిచే మసి యైన
మధురమన్మథమూర్తి మఱల బ్రతికె
నప్సరోగణము నాట్యరహస్యముల్ నేర్వ
సురరాజు సభతోడఁ జూడ వచ్చె
సంగీతమం దున్నశ్రావ్యశక్తులఁ జూడ
శారద వీణతో సాఁగి వచ్చె
సకలకళాతపస్సంపన్నులం జూడ
దేవతానీక మేతెంచి నేఁటి
రాయల లలితకళల సామ్రాజ్య మరసి
చిత్రితస్వరూపాకృతిఁ జేష్ట లుడిగి
కనుల వాల్పక యనిమిషగణము లైరి
చూడుఁ డని కుడ్యచిత్రముల్ సుకవి చూపె. 149

బ్రహ్మవ్రాఁతలు సత్య మై ప్రతిఫలించుఁ
గాని సౌందర్యశివములు గానఁబడుట
కష్ట మగుచుండ మన చిత్రకారులందు
సత్యసౌందర్యశివములు స్పష్ట మయ్యె. 150

ఏ మహామహోజ్జ్వలశక్తి నెల్లగతుల
నుపనిషత్తులు ఘోషించునో సతంబు
నా మహామహోజ్జ్వలశక్తు లవతరింపఁ
జిత్రకారుల వ్రాఁతలు సిద్ధి పొందె. 151

రాయల రసామృతచరిత్ర రమ్యముగను
శిలలు మాటాడెఁ జిత్రముల్ చెప్పఁగొనియొఁ
జల్లగాలులు విన్పించె శ్రావ్యముగను
భావములు శాశ్వతానందఫలము లొసఁగె. 152

మురళిలోఁ దాఁగి యుండినముద్దుగీతి
వాణి వీణియ నణఁగుశ్రావ్యస్వరంబు
కృష్ణపండితు హృదయానఁ గ్రేళ్ళు ద్రిప్ప
సృష్టి నుబ్బాఁత లూఁపె నిర్జీవవీణ. 153

అప్సరఃకాంతి దీపింప నద్భుత మగు
లలితకళ లొక్క-రూప మాలక్ష్మివోలె
భరతనాట్య మానందసంభరిత మయ్యె
భారతీదేవి సొగసులు పరిమళించె. 154

అయ్యలార్యశక్తి నద్భుతం బనిపించు
మల్లనార్యకవిత మధుర మయ్యె
నందివారినడక నాజూకు, ధూర్జటి
యోగభోగముల మహోజ్జ్వలుండు. 155

వైష్ణవప్రభావవైశిష్ట్య మెల్ల శ్రీ
కాకుళాంధ్రదేవుఁ డాజ్ఞ యిడఁగ
నాంధ్రభోజుఁ డగుచు నాముక్తమాల్యద
రాయలు రచియించెఁ బ్రౌఢఫణితి. 156

తమిళభాషాబ్ధి నణఁగుముత్యముల నేరి
సంస్కృతీదివ్యశక్తుల సానఁ బట్టి
తెలుఁగునకుఁ గ్రొత్తఁదన మిచ్చెఁ దెలుఁగుఱేఁడు
పసిఁడి కీనాఁడు ప్రాపించెఁ బరిమళంబు. 157

ఇరుసహాయవిలక్ష మింపుగా రచియించెఁ
దమిళభాషను హరిదా సితండు
కమ్మని కర్ణాటకవితలో భారత
మ్ము రచించుతిమ్మణ్ణ పూజ్యుఁ డితఁడు
సంస్కృతంబున సరస్వతివిలాసము వ్రాయు
పండితలక్ష్మీధరుం డితండు
శారదాహృదయవిహారుఁ డై సంగీత
సూర్యోదయం బనుసుప్రసిద్ధ
గ్రంథరచన మొనర్చునారాయణుఁ డితఁ
డంచు వేఱువేఱుగఁ బ్రస్తుతించి చూపి
కవులయోగ్యత పెద్దనకవి వచింపఁ
బొంగె రాయలు సభయు నుప్పొంగె నంత. 158

ఒకని వాగ్ధార కోహో యంచు వినుతించి
రతనాలరాసుల రాశిఁ బోసె
నొకని మృదుపదప్రయోగంబులం జూచి
పసిఁడిటంకంబుల వాన గురిసె

నొకని వినూత్నభావోన్మీలనాశక్తి
కచ్చెరు వంది ముత్యాల నొసఁగ
నొకని భావౌచిత్య మూహించి యగ్రహా
రాదిదానంబు లందంద యొసఁగెఁ

కల్పవృక్ష మై సభ రాజు కనికరింప
నత్తకోడండ్ర కలహంబు లణఁగి పోయెఁ
గలుములపడంతితోఁ బలుకుల వెలంది
కలసి విహరించె సకలసత్కవులయిండ్ల. 159

ఆంధ్రభోజుని సహృదయోద్యానలక్ష్మి
కవిసుధీజనకల్పవృక్షంబులందు
విరిసి దిగ్గ్దంతంబులఁ బరిమళించి
యమృత మొలికించి జగతికే హాయిఁ గూర్చె. 160

పారిజాతప్రసూనంబు పరిమళించెఁ
గృష్ణరాయల సాహితీక్షేత్రమందుఁ
బలుకుఁ బూఁబోఁడి మెత్తని చెలువఁదనము
నందితిమ్మన నేర్పుతో నాచుకొనియె. 161

ముగ్ధమోహనలావణ్యమూర్తి యగుచు
మధురసాకృతి నాత్మసంభవ మగుతన
మనుచరిత్రం బనుకవితాప్రణయవతికిఁ
బెద్దన ముసుగుతెర దీసె విభుఁడు మెచ్చ. 162

తీర్చి దిద్దినయంగముల్ తేట లొలుకు
కాంతి రీతి యోజోగుణకలిత యగుచు
యుక్త మగువర్ణనాలంకృతోజ్జ్వల యయి
సరస యగుకావ్యకన్యక సన్నుతి గొనె. 163

పదమానందప్రద మై
మృదులం బగుభావగుణ మమృతఘుటికలు గాన్
హృదయోన్మీలన మొనరిం
చి దివ్యత నొసంగెఁ గృతి వశీకృతసభ మై.

హాసనోన్ముఖుఁ డై రాయలు
రసభావాలంకృత మగుగ్రంథాంగన కేల్
స్పృశియింపగఁ బెద్దనమా
నస మలరెన్ సభ సుధీజనంబులు పొగడెన్. 165

ఆమ్నాయపరిపూత మా నొక్కనిధిషణా
సారంబు వెన్నెల లారఁ బోసె
శివజటాభ్రాంతరస్మేర యాగంగాత్త
బకపంక్తి నొక్కని ప్రజ్ఞ విరిసె
నొకని మేధాశక్తి యొయ్యార మొలికించి
వేదవాఙ్మయలక్ష్మి వెలుఁగు లుమిసె
భారతీదేవిచేఁ బట్టుసెల్లాలఁ గ
ట్టించి నాట్యంబు లాడించె నొకఁడు

తరతరాలుగ నీ సభాస్థానవేది
పావనం బయ్యె శారదాప్రౌఢి మెఱసి
మించు పెద్దనకవితావిపంచి నవర
సామృత మొలుక రాగంబు లాలపించె. 166

మధురమనోహరం బనఁగ మాచరితంబు నిటుల్ రసామృతో
దధి నొనరించి వాఙ్మయపథంబున సుస్థిరరూప మిచ్చి యీ
బుధవరు లెల్ల మెచ్చ మముఁ బూజ్యులఁ జేసెడిసత్కళాతపో
నిధులకు మీకు మే మొసఁగ నేర్చెడి దేదియు లేదు భూమిపై.

తన సర్వస్వము ధారవోయుజనకున్ ధన్యాత్మునిం జేయ నొ
క్క నమస్కారము కాక తక్కినవి లెక్కన్వచ్చునే? కాన మా
మనముం గైకొని మే మొసంగెడిది యేమాత్రంబు నూహింపకుం
డనుచున్ బంగరుపల్లకిన్ భటులచే నాతేడు తెప్పించుచున్.

బ్రహ్మసృష్టిని దల దన్ను ప్రవరసృష్టి
సత్యను సృజింప నేర్చినసత్కళాత
పఃప్రభావంబె మన యాంధ్రభాష కరయ
రెండు నేత్రంబులై మనఃప్రీతిఁ గూర్చు. 169

సకలకళాస్వరూపముల సార మెఱుంగురసజ్ఞులార! యాం
ధ్రకవితలో సరస్వతి స్వతంత్రకళావిభవంబుఁ జూపె మా
సుకృతి ఫలించె జాతి నవశోభఁ దలిర్చెఁ గళాతపస్సునన్
ప్రకటితసిద్ధుఁడై తనరెఁ బండితసన్నిధిఁ బెద్దనార్యుఁడున్. 170

వినినన్ హాయిని గూర్చుఁ జూచినఁ గళావిశ్వంబు చూపించు నె
మ్మన మానందరసోదధి న్నచటనో మై పొంగఁ దేలించు నూ
తనసాహిత్యము సృష్టి చేసిరి కళాతత్త్వజ్ఞులై యాంధ్రు లీ
దినమే స్వర్ణయుగంబు కాదని యని నాందిం బాడెఁ బెద్దన్నయున్.

అను చా యాంధ్రప్రబంధమార్గరచనాధ్యక్షున్ సభాధ్యక్షుఁ బె
ద్దన నత్యంతవిధేయుఁడై దరిసె విద్యాసారవిద్యుద్రుచుల్
కనుపించెం గనులందు నీరసికలోకం బెల్ల దీపింపఁగాన్
దృణ మా మా దగుసేవలం గొనుఁడనెన్ బృథ్వీవిభుం డంతటన్.

తెల్లని ముత్తెపుంసరుల దిక్కులు వెల్గఁ బసిండికాంతి వి
ద్యుల్లత లాచుఁ బ్రాక దివినుండి సరస్వతి వచ్చెనో యనన్
బల్లకిఁ బట్టి తెచ్చె భటవర్గము నెల్లరుఁ జూచుచుండ భూ
వల్లభుఁ డంత నాంధ్రకవివర్యునిఁ బెద్దన నల్లఁ జూచుచున్.

ప్రవరుని సృష్టించిన యో
కవికమలజ! మీకు సాటి గలరే? మా హైం
దవధర్మరహస్యంబుల
వివరించినమిమ్ముఁ దత్త్వవేత్తలఁ గొలుతున్. 17

నన్నయ్యవాణి ప్రసన్నకథాకలి
తార్థయుక్తుల రహస్యంబు తెలుప
శిల్పి తిక్కనకళాసృష్టిలో విరిసిన
బ్రహ్మశక్తులు కొన్ని పట్టువడఁగ

సూ క్తులం గలరసస్రోతస్సులం బ్రబంధ
పరమేశ్వరుండు కొంత పట్టుం దెలుపం
గలకండ కరంగించి కై తలోం బోంత పో
సినయాంధ్రకవిరాజు చిటిక లెఱింగి

నవ్యకవితాప్రబంధబంధంబులందు
నం దె వేయుచు మీ చేయి హాయిం గొల్పె
నాంధ్రకవితాపితామహా! అల్లసాని
పెద్దనామాత్య! కవితకుం బెద్ద వయ్య! 175

జన్మ మందియు దీనికిం జావు లేదు
యౌవనమె కాని వార్ధక మరయ దెపుడు
మూండుకాలాల విడిపోనిముడిని వేయు
గుణము మీ కృతి కల రెం బెద్దనకవీంద్ర! 176

స్వామీ! తమ దర్శనమే
మా మానవజాతి కెపుడు మహిమాన్విత మా
మా మనములు పుష్పింపంగ
నీ మృదుపల్యంకిక నిట నెక్కం దగుం గా. 177

అని వినయోదారమనం
బున రారాజు కవిరాజుముఖముం గని ప్రా
ర్థన సేయుచుం బెద్దన న
ల్లనం బల్లకి నెక్కం జేసె లాలిత్యమునన్. 178

కవు లానందపయోధిఁ
వివశాత్మత మునిఁగి రంత విద్వద్ఘనులుఁ
వివిధగతులఁ బొగడ మహీ
ధవుఁ డల్లనఁ బల్కెఁ దనుఁ దాఁ బై కెత్తెఁ. 179

ఆంధ్రభాషాయోష నందల మెక్కించి
వీథివీథులఁ ద్రిప్పువిభవ మేమొ!
అవనినాథుల సేవ లందురారాజునే
బోయిగాఁ జేసినపుణ్య మేమొ!
రాచవర్గంబు బరాబరుల్ తీర్చెడి
సుభటులం జేసినసుకృతి యేమొ!
పట్టుశాల్వాలపైన బంగారుపూవులఁ
బ్రజలచేఁ జల్లించుభాగ్య మేమొ!
యుగయుగంబులఁ గడచు నీ యుర్విపైన
సార్వభౌములు సాహితీసార్వభౌము
లిట్టు లొకట యెచట నైన నెప్పు డైనఁ
గంటిమే యంచుఁ బ్రజ వేయికనులఁ జూచె. 180

తెలుఁగుల కబ్బె యోగ మని తెల్పఁగఁ గొందఱు, కాదు దాక్షిణా
త్యుల కిది ఖ్యాతిఁ దెచ్చె నని యుబ్బిరి కొందఱు, కాదు కాదు ప్రో
జ్జ్వలమగుభారతాభ్యుదయసంస్కృతిచిహ్న మటంచుఁ గొందఱుం,
బలుకఁగఁ గొందఱన్నియు శుభంబులుసత్యము లంచుఁ జాటఁగన్.

కవి యదృష్టమో! ప్రజల భాగ్యంబో! నృపునిఁ
దేల్చినవిచిత్ర యోగమో! తెలియ రాని
కాలకర్మప్రభావమో కాన మంచుఁ
బ్రజలు వేయివిధంబులఁ బ్రస్తుతింప. 182

సత్యం బగు మీ కథ నౌ
చిత్య మెఱింగి సొగసుగ రచించుచు మీ సాం
గత్యమె శుభత్వ మని ప్రజ
నిత్యము మిముఁ గొల్చు ననిరి నృపుని కవీంద్రుల్. 183

కావ్యాంగన యాలింగన
మవ్యయ మై మధురసామృతం బై నృపునిన్
దివ్యు నొనర్పఁగ గజపతి
నవ్యోజ్జ్వల మైనయాత్మనందన నొసఁగెన్. 184

అన్నపూర్ణామహాదేవి యంతిపురము
సొచ్చె లలితకళాంగన సుప్రతిష్ఠ
దెచ్చె దిగ్దిగంతంబులఁ దెలుఁగువెలుఁగు
వెలిఁగె బ్రతుకు పండించె రాయలచరిత్ర. 185

అది విశాలనీలాకాశహృదయవీథి
కనులపండువు గూర్చిన కాంతి రేఖ
యది యనంతకాలంబునం దమృతఘటిక
మఱపు రానిశ్రీకృష్ణరాణ్మణిచరిత్ర! 186

తిమ్మరుసుశక్తి నృపుని ఖడ్గమ్మునందు
మెఱసె, నృపుని సుహృదయంబు విరిసెఁ గవుల
కావ్యసరసులఁ, గవుల ప్రజ్ఞాబలంబు
దనిపెఁ బ్రజల, విద్యారణ్య తపము పండె.

# శుద్ధపత్రము

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 6 | 6 | భవితార్థ | భవితవ్య |
| 6 | 10 | పుష్పీభూతమా కాలము | హాయింగూర్చు కాలంబున |
| 15 | 4 | నృపాగ్రుండందు | నృపాగ్ర్యుండందు |
| 21 | 2 | సంస్కృతీ | సాంస్కృతిక |
| 29 | 3 | వేదారామల | వేదార్థామల |
| 34 | 11 | తగులఁబడియె | వ్రక్కలయ్యె |
| 35 | 2 | విశ్వమునెల్లన్ | విశ్వంబెల్లన్ |
| 38 | 10 | పుప్పొడుల్ | చప్పుడుల్ |
| 42 | 1 | నేకీభావము | యందేకత్వముం |
| 42 | 2 | జేయ | జేయు |
| 46 | 12 | సువర్ణ హారతి | పసిండిహారతి |
| 58 | 5 | మర్త్యధర్మంబె | మనుజకృత్యంబె |
| 62 | 20 | తోఁజాటుచుండె | చేఁ జాటఁబడియెఁ |
| 72 | 7 | మానవ | మోహన |
| 74 | 2 | నటికిదదన్య | నటి కెద రన్య |
| 94 | 12 | మోడె | మోదె |
| 95 | 19 | వాని | వాటి |
| 98 | 10, 11 | ప్రయత్నంబులో నణు | ప్రయత్నంబు నం దణు |
| 98 | 19 | నిమ్మహీ | నివ్విభు |
| 105 | 20 | చుండె | చుండి |
| 106 | 1 | తమపై | తనపై |
| 108 | 10 | నాయని | నాయుని |
| 108 | 15 | హాయిని | సౌఖ్యము |
| 111 | 19 | పెట్టవచ్చు | పెట్టవచ్చునీ |

